# భావము-భాష




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

www.thraithashakam.org







# భావము-భాష


రచయిత

త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (80) దశ సప్తాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-38 ప్రథమ ముద్రణ : సెప్టెంబరు-2016

ప్రతులు : 1000 వెల : **70/-**

02 **యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు**

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
03) ధర్మము-అధర్మము.
04) ఇందుత్వమును కాపాడుదాం.
05) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
06) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
07) సత్యాన్వేషి కథ.
08) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
09) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
10) గీతా పరిచయము (తె/ఇ).
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు (తె/ఇ/క).
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ.
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) దేవుని గుర్తు-963.
37) మతము-పథము.
38) ఇందువు క్రైస్తవుడా?
39) ఆత్మలింగార్థము.
40) నాస్తికులు-ఆస్తికులు.
41) గుత్తా.
42) ప్రబోధ తరంగాలు.
43) త్రైత సిద్ధాంతము.
44) రూపము మారిన గీత.
45) ద్రావిడ బ్రాహ్మణ.
46) తీర్పు.
47) కర్మ పత్రము.
48) ప్రవక్తలు ఎవరు?
49) ధర్మశాస్త్రము ఏది?
50) వార్తకుడు-వర్తకుడు.
51) దేవుని చిహ్నము.
52) ఏది నిజమైన జ్ఞానము?
53) నిగూఢ తత్త్వార్థ బోధిని.
54) ప్రబోధానందం నాటికలు.
55) మత మార్పిడి దైవద్రోహము.
56) మతాతీత దేవుని మార్గము.
57) హేతువాదము-ప్రతివాదము.
58) నీకు నా లేఖ.
59) జీహాద్ అంటే యుద్ధమా?
60) త్రైతశక పంచాంగము.

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

61) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
62) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
63) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
64) మరణము తర్వాత జీవితము.
65) ఏ మతములో ఎంత మతద్వేషము?
66) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
67) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
68) ప్రతిమ × విగ్రహ-దైవము × దెయ్యము.
69) స్వర్గము ఇంద్రలోకమా!-నరకము యమరాజ్యమా!!
70) ఒక మాట మూడు గ్రంథములు.
71) లు అంటే ఏమిటి? (తెలుగు)
72) ఆదిత్య.
73) చెట్టుముందా! విత్తుముందా?
74) ఒక్కడే ఇద్దరు.
75) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
76) దేవుని రాకకు ఇది సమయము కాదా!
77) సాయిబాబా దేవుడా! కాదా?
78) విశ్వ విద్యాలయము
79) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
80) గీటురాయి
81) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు
82) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు
83) భావము-భాష
84) దైవగ్రంథములలో సత్యాసత్య విచక్షణ
85) అంతిమ దైవగ్రంథము ఎలా పుట్టింది?
**86) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**87) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**88) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**89) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు (రెండవ భాగము)**

# ఇతర సంఘముల ప్రచురణలు

## ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ

1. అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు. 2. ఖుర్ఆన్‌లో ఆణిముత్యాలు.
3. అంతిమ దైవగ్రంథములో అర్థాలు-అపార్థాలు. 4. జకాత్ (ఆర్థిక సేవ).
5. అంతిమ దైవగ్రంథములో జ్ఞాన రత్నాలు. 6. షరియతా-జ్ఞానమా.
7. అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు. 8. ఖుదా-అల్లాహ్. 9. రెక్కల గుఱ్ఱము.
10. చంద్రుడు-నక్షత్రము.

## సువార్త క్రైస్తవ సంఘం

1. సువార్త బైబిలు. 2. దేవుని మార్గము-మన ప్రయాణము.
3. మత్తయి సువార్త మర్మాలు. 4. మతాలన్నిటికి ప్రాథమిక జ్ఞానము.
5. మత ధిక్కారము కాదు-సత్యగ్రాహితము. 6. పాప క్షమాపణ ఎలా కలదు?
7. ముందు చూపు.

## రావణ బ్రహ్మ ద్రావిడ బ్రాహ్మణ సంఘం

1. త్రైత సిద్ధాంత పరిశీలన
2. త్రైత సిద్ధాంతం సూపర్ సైన్స్
3. కాలజ్ఞానములో ఆనంద గురువు.
4. అంతర్ ధన శతకము (జ్ఞాన ధన శతకము)
5. బెర్ముడా ట్రయాంగిల్-సైంటిస్ట్‌లకు సవాల్
6. ట్విన్ టవర్స్ (9/11) ట్రూత్

## ద్రావిడ శ్రేష్ఠి సంఘం

1. సంఖ్య లో అంఖ్య

*DVD'S*

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము.
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూ మహాసముద్రము.
11. సృష్ఠి-సృష్ఠికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము.
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు.
40. బయటి సమాజం - లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవుని జ్ఞానము-మాయ మహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము.
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.
56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.

*DVD'S*

61. కర్మ లేని కృష్ణుడు-
కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము.
63. సహజ మరణం-
తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము.
65. దేశం మోసం-దేహం మోహం.
66. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
67. జీర్ణ+ఆశయము.
68. మేఘం ఒకభూతం-
రోగం ఒకభూతం.
69. దేవునికి మతమున్నదా?
70. ఇచ్ఛాధీన కార్యములు-
అనిచ్ఛాధీన కార్యములు.
71. ఏది ధర్మము?
72. అధర్మ ఆరాధనలు.
73. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
74. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
75. నిదర్శ - నిరూప.
76. నటించే ఆత్మ.
77. సంచిత కర్మ.
78. గురువు ఎవరు?
79. శ్రీకృష్ణుడు ఎవరు?
80. సుఖము-ఆనందము.
81. టక్కుటమారా, ఇంద్రజాల
మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.
82. భయం.
83. దశ-దిశలు.
84. ఆడించే ఆత్మ.
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
87. ఏది శాస్త్రము?
88. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
89. 6-3=6.
90. గుర్తింపబడనివాడు గురువు.
91. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
92. చంద్రాకారము (బట్టతల).
93. మతములలో పవిత్రయుద్ధము.
94. మూడు గ్రంథములు.
95. ఏడు ఆకాశములు.
96. దైవగ్రంథము
97. జ్ఞానము కబ్జా అయ్యింది!
98. భక్తి-భయము.
99. జ్ఞానశక్తి.
100. కాలజ్ఞాన వాక్యములు.
101. అర్థము-అపార్థము.
102. తోలేవాడు.
103. గురు చిహ్నం.
104. భక్తి-శ్రద్ధలు.
105. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
106. పురుషోత్తమ.
107. మతద్వేషము.
108. నీ వెనుక వాడు.
109. గ్రంథము - బోధ.
110. ఆట - దోబూచులాట.
111. ప్రజలు - మానవులు.
112. ఆస్తి - దోస్తి.
113. దంతము-అంతము.
114. మాయ మర్మము- ఆత్మ ధర్మము
115. శ్రీకృష్ణుడు
చనిపోయాడా? చంపబడ్డాడా?
116. అంతిమ గ్రంథములో
ప్రథమ వాక్యములు.
117. అదురు-బెదురు.
118. ఆధ్యాత్మిక ప్రశ్నలు - జవాబులు.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**చెన్న ఆంజనేయులు** (కరెస్పాండెంట్)
జ్ఞానోదయ హైస్కూల్, ఇటిక్యాల,
రాయికల్ మం॥, కరీంనగర్ (జిల్లా)
Cell : 95507 97782, 95538 30871

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**P.M.H నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9440490963

**P. రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, బస్టాండు రోడ్
కోయిలకుంట్ల (మం), కర్నూలు (జిల్లా)
Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)**
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు జిల్లా.
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి (ప్ర.సభ్యుడు)**
నరసరావు పేట, గుంటూరు జిల్లా
Cell : 9989204097, 9849555738

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం జిల్లా.
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా)
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252,
9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:7680065963, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘువేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# యోగీశ్వరుల వారి రచనల సారాంశము

1) త్రైత సిద్ధాంత గ్రంథములలో అక్షర సముదాయమే, ఆత్మ సమాచారమై ఉన్నది.
త్రైత సిద్ధాంత గ్రంథములలో క్షయ అక్షయ సమాచారము,
పరమాత్మ సమాచారము ఉన్నది.

2) త్రైత సిద్ధాంత సంబంధ గ్రంథములను భౌతికముగా వ్రాసినది యోగీశ్వర్లు.
త్రైత సిద్ధాంత అనుబంధ గ్రంథములలో అభౌతికముగా యోగశక్తి ఉన్నది.

3) త్రైత సిద్ధాంతము ఇందూ (హిందూ) ధర్మములలో విప్లవాత్మకమైనది.
త్రైత సిద్ధాంత గ్రంథములలోని జ్ఞానము సంచలనాత్మకమైనది, చదివి చూడండి.

4) త్రైత సిద్ధాంతము లోకములో అన్నిటికంటే గొప్పది. త్రైత సిద్ధాంత
గ్రంథములు అన్ని గ్రంథములను మించినవి, దాని రచయిత యోగులకు
ఈశ్వరుడైన యోగీశ్వరుడు.

5) త్రైత సిద్ధాంత గ్రంథములు కనిపిస్తే దుష్టశక్తులు భయముతో వణికిపోతాయి.
త్రైత సిద్ధాంత గ్రంథములను దగ్గర ఉంచితే యోగశక్తికి తాళలేక
భయపడిపోతాయి.

6) త్రైత సిద్ధాంత జ్ఞానము భగవద్గీత తరువాత చెప్పబడిన అతి గొప్ప జ్ఞానము.
త్రైత సిద్ధాంత గ్రంథములలో కృష్ణుడు ముందు చెప్పని జ్ఞానమును కూడా
యోగీశ్వర్లు చెప్పారు.

7) త్రైత సిద్ధాంత జ్ఞానము మానవ జీవితమునకు గొప్ప వెలుగు.
త్రైత సిద్ధాంత వెలుగులోనికి పోయిన వానికి అది దైవశక్తి అని తెలియును.

8) త్రైత సిద్ధాంత భగవద్గీతను వ్రాసినది యోగీశ్వర్లు. అందువలన
త్రైత సిద్ధాంతము అంటే ఏమిటో, అది ఎంత గొప్పదో తెలియబడినది.

9) త్రైత సిద్ధాంతమును గురించి తెలియగలిగితే, యోగీశ్వరుల గ్రంథములను
చదువగలిగితే, ఏ మతస్థుడైనా ఒప్పుకొని తీరును, దానిని ఆచరించును.

10) త్రైత సిద్ధాంతము ప్రత్యక్షముగా భగవంతుడు చెప్పినది. అందువలన అన్ని
మతముల సారాంశము త్రైత సిద్ధాంత గ్రంథములలో కలదు.

11) త్రైత సిద్ధాంత గ్రంథములు వ్యక్తి వ్రాసినవి కావు, వ్యక్తిలోని శక్తి వ్రాసినవి.
అందువలన అన్నీ రహస్యములే చదివి తెలుసుకోండి.

12) త్రైత సిద్ధాంతము భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములలో కలదు. అయినా
హిందువులకుగానీ, క్రైస్తవులకుగానీ, ముస్లీమ్‌లకుగానీ ఆ విషయము
తెలియదు.

# భావము-భాష

భావమునకు భాషకు అవినాభావ సంబంధము కలదు. అగ్నికి ప్రకాశమున్నప్పుడే దానికున్న ప్రకాశమునుబట్టి ఇది అగ్ని అని తెలియు నట్లు, భావమునకు భాషయుంటేనే భాషనుబట్టి భావము తెలియును. అగ్నికి ప్రకాశము ఎలా అంటుకొనియుండునో, అలాగే భావమునకు భాష అంటుకొనియుండును. మనిషిలోగానీ, జంతువులోగానీ భావము పుట్టుక రావడము సహజము. జీవమున్న ప్రతిప్రాణికి గుణ భావములు తలలో పుట్టుచునేయుండును. అలా పుట్టిన కొన్ని భావములను బయటివారికి తెలియజేయుటకు ఉపయోగపడు విధానమును 'భాష' అంటాము. భాష అనగా భావప్రకటన యని తెలియుచున్నది. భావము ఒకటి యుండగా దానిని ఎలాగయినా, ఎన్ని విధములయినా ప్రకటించవచ్చును. ఉదాహరణకు ఒకనికి దాహమైనప్పుడు నీళ్ళు కావాలను భావము వానిలో పుట్టును. అప్పుడు ఆ భావమును బయటికి ప్రకటించి ఇతరులకు తాను దాహముతో యున్నానని తెలుపుట వలన అతనికి నీరు లభించును, దాహము తీరును. భావము ఒకటే అయినా భాష ఎన్ని రకములయినా ఉండవచ్చును. "భావము, భాష" విధానమును తెలుపు ఒక సంఘటనను వివరించు కొందాము. ఒక సంఘటనలో జరిగిన దానిని చూస్తే భావమునకు అనుబంధముగా యున్న భాష ఎలా కలదో తెలియగలదు.

ఇద్దరు మనుషులు ఒక దారిలో ప్రయాణిస్తూ పోతున్నారు. వారి ప్రయాణ మార్గములో చిట్టడవి యుండుట వలన ఆ అడవి మార్గము ద్వారా ప్రయాణిస్తూ పోతున్నారు. ఆ సమయము మధ్యాహ్న సమయమగుట వలన వారికి దాహము కల్గుట ప్రారంభమాయెను. అప్పుడు వారిలో 'నీరు అవసరము' అను భావము ఏర్పడినది. నీరును త్రాగితే వారి దాహము

తీరును. వారిద్దరు అన్నతమ్ములే ప్రయాణించుచున్నారు. ఒకరికి చదువు రాదు, తెలుగు భాష తప్ప ఇతర భాషలు ఏవీ తెలియవు. తమ్ముడు చదువురాని వాడుకాగా అన్నకు చదువు వచ్చును, అతనికి ఐదు భాషలు వచ్చును. వారిద్దరికి దప్పిక ఎక్కువ కావడము వలన నీటి కొరకు వెతకాలనుకొన్నారు. అప్పుడు వారికి ఒక ఫర్లాంగు దూరములో ఒక పూరిగుడిసె కనిపించినది. అక్కడ మనుషులున్నట్లు కూడా కనపడగా, అన్న తమ్ముని అక్కడే చెట్టుక్రింద కూర్చోబెట్టి తాను నీరు కొరకు కనిపించే గుడిసె దగ్గరికి పోయాడు. కర్నాటక రాష్ట్రమునుండి వచ్చినవారు చిట్టడవిలో కొంత పొలమును శుభ్రము చేసుకొని పంటను పెట్టుకొనెడివారు. అక్కడికి పోయిన మనిషి తెలుగు భాషలో నీళ్ళు కావాలని దాహముగా యున్నదని అడిగాడు. అయితే అక్కడున్న వారికి తెలుగుభాష రానందున, కన్నడ భాష తెలిసినందున దాహముకొన్న మనిషి ఏమి అడుగుచున్నాడో వారికి ఏమీ అర్థముకాక వారు చూస్తూ ఉండిపోయారుగానీ నీళ్ళు ఇవ్వలేదు.

అప్పుడు వారికి తెలుగు భాష తెలియదని తెలిసిన ఆ దాహము గల వ్యక్తి, తనకు ఇతర భాషలు కూడా కొంత వచ్చుట వలన హిందీలో అడగడమైనది. వారికి హిందీ కూడా తెలియకపోవడము వలన వారు తమకు తెలియదు అన్నట్లు చేయి అల్లాడించి ఊరకున్నారు. వారికి హిందీ భాష కూడా తెలియదని గ్రహించిన ఇతను తమిళ భాషలో అడిగాడు. అప్పుడు కూడా వారు భాష మాకు తెలియదను వారి భావమును చేయి అల్లాడించి తెలిపారు. ఇప్పుడు మనము గమనించితే దప్పికకొన్నవాడు మూడు విధముల మూడు భాషలలో తన భావమును ప్రకటించగా అక్కడున్నవారు తమకు ఆ భాష రాదను భావమును చేయి అడ్డముగా అల్లాడించి వారి భావమును వారు చెప్పడమైనది. నీరు దప్పికయిన

మనిషి తన భావమును మూడు విధముల భాషలలో తెలుపగా వారు మాత్రము తమకు తెలిసిన భావమును చేయి అల్లాడించి తెలిపారు. ఈయన భావమును మూడు భాషలుకాక నాల్గవ భాష అయిన కన్నడములో అడిగాడు. అప్పుడు వారు నవ్వుచూ కన్నడములోనే జవాబు చెప్పి నీళ్ళు ఇవ్వడము జరిగినది. ఈ మారు ఇరువైపుల ఇద్దరూ ఒకే భాషను మాట్లాడడము వలన ఈయన భావము వారికి అర్థమయినది. వారి భావము కూడా ఈయనకు అర్థమయినది.

ఆ విషయము అట్లుండగా దారిప్రక్కన కూర్చున్న వ్యక్తికి దారిలో పోవు ఇద్దరు అన్నదమ్ములు కనిపించగా తమ్ముడు నాకు నీరు దప్పికగా యుంది, మీ వద్ద నీళ్ళుంటే ఇవ్వండి" అని అడిగాడు. అప్పుడు అతను ఆ మాటను విని "నా వద్ద నీళ్ళున్నాయి" అని చెప్పి తమ్మునికి ఇవ్వడము జరిగినది. ఈ విధముగా ఒక తెలుగు భాష మాత్రము వచ్చినందుకు ఒక మాటతోనే నీళ్ళను అడిగి సంపాదించుకోగలిగాడు. నాలుగు భాషలు వచ్చిన అన్నకు నీళ్ళు దొరకడానికి ఐదారు నిమిషములు పట్టినది. దీనికంతటికీ కారణము ఒకరినుండి మరొకరికి భావము చేరడములో అన్న దగ్గర ఆలస్యమయినది. తమ్ముని దగ్గర ఆలస్యము కాలేదు. భావము ఒకరినుండి మరొకరికి తొందరగా చేరడము వలన తమ్మునికి తొందరగా పని అయ్యింది. అలా భావము ఒకరినుండి ఇంకొకరికి చేరక ఆలస్య మగుటవలన అన్న పని ఆలస్యమయినది. భావము శరీరమునుండి బయటికి వచ్చు విధానమును 'భాష' అనవచ్చును.

**1) ప్రశ్న :- మనుషులలో భాషలుండవచ్చును. అదే జంతువులలో అయితే భాష లేదు కదా! వాటి పరిస్థితి ఏమిటి?**

**జవాబు :–** నీకు తెలిసిన భాష జంతువులకు తెలియదు. అంతమాత్రమున వాటికి భాష లేదని నీవు ఎలా చెప్పగలవు? ఇంతకుముందు చెప్పిన సంఘటనలో ఒక వ్యక్తి మూడు భాషలలో అడిగినా అక్కడి వారికి అర్థము కాలేదు. అంతమాత్రమున వారికి భాష లేదు అని చెప్పలేము కదా! నీకు వచ్చిన భాష వారికి, వారికి వచ్చిన భాష నీకు తెలియకుండాపోయి ఉండవచ్చును. అంతమాత్రమున వారికి భాష లేదు అని చెప్పలేము కదా! అట్లే నీకు తెలిసిన భాష ఇతరులకుగానీ, ఇతర జంతువులకుగానీ తెలియనంత మాత్రమున వారికి భాషే లేదు అనుకోకూడదు. ఇతరులకు గానీ, జంతువులకుగానీ వారికి తెలిసిన భాష ప్రత్యేకముగా యుండవచ్చును కదా! ఇంతకుముందు నీళ్ళ కొరకు పోయిన వ్యక్తి అక్కడి గుడిసెవాసులను నాలుగు భాషలలో నీళ్ళు అడిగాడు కావున అందులో ఒక భాష వారికి తెలియుట వలన చివరిలో అడిగిన కన్నడ భాషతో వారు మాట్లాడగలిగారు. ఒకవేళ వారికి నాలుగు భాషలు రాకపోయివుంటే, భారతదేశములోని భాషలన్నిటిని చెప్పినా అవి వారికి తెలియకపోతే వారికి భాష లేదని చెప్పవచ్చునా? వారికి ఇతర దేశ భాష అయిన చైనీ భాష వచ్చియుంటే ఆ భాష నీకు తెలియదు, కావున అది నీకు రాదని సరిపెట్టుకోవచ్చును. అట్లుకాక వారిది భాషకాదనో, వారికి భాష లేదనో, వారికి ఏ భాష రాదనో చెప్పలేము కదా! అట్లే జంతువులకు వచ్చిన భాష నీకు తెలిసిన భాషలలో లేకుండా పోయి ఉండవచ్చును. వాటి భాష నీకు తెలియదని చెప్పవచ్చును గానీ, వాటికి భాషే లేదని ఎలా చెప్పగలము? జంతువులకు, పక్షులకు, వృక్షములకు, తీగలకు జీవమున్న అన్నిటికీ భాషయున్నది. ఒకరి భాష మరొకరికి తెలియకపోవచ్చునుగానీ, మనకు తెలియక పోయినంత మాత్రమున ఇతరులకు భాష లేదు అనడము తప్పు. మనుషులకు తెలిసిన భాష ప్రక్క రాష్ట్ర ప్రజలకే తెలియదు. అలా భాష తెలియకపోవచ్చునుగానీ

భాష లేదనుటకు వీలులేదు. దీనినిబట్టి జంతువులకు, వృక్షములకు కూడా భాష కలదని చెప్పవచ్చును.

**2) ప్రశ్న :- మనుషులలో ఒక భాష తెలిసిన వారు గలరు. అలాగే ఎక్కువ భాషలు తెలిసిన వారు గలరు. జంతువులలో వాటికి తెలిసిన భాష ఒకటే యుంటుందా? లేక ఎక్కువ భాషలు కూడా కలవా?**

**జవాబు :-** జంతువులలో అనేక జాతులు కలవు. ఒక్కొక్క జాతికి ఒక్కొక్క భాష కలదు. ఒక్క జాతిలోనే అనేక భాషలు లేవు. జంతువులలో పిల్లి జాతి వేరు, కోతి జాతి వేరుగా యుండుట వలన పిల్లిజాతికి ఒక రకమైన భాష, కోతి జాతికి ఒకరకమైన భాష వేరువేరుగా యున్నవి. అదే విధముగా ప్రతి జాతికి వాటికి పుట్టుకతోనే వచ్చిన భాష ఒకటి ఉండును. అందువలన అన్ని రకముల జాతులకు అన్ని ప్రత్యేక భాషలు కలవని చెప్పవచ్చును.

**3) ప్రశ్న :- మనిషి శిశు దశ నుండి తల్లితండ్రులను గమనించుచుండుట వలన మూడు నుండి ఐదు సంవత్సరముల లోపల పిల్లలకు పెద్దలు మాట్లాడు భాష వచ్చుచున్నది. మూడు నుండి ఐదు సంవత్సరముల పిల్లలకు పెద్దలు చెప్పినది అర్థము కాగలదు. అంతకంటే చిన్నపిల్లలకు అనగా పెద్దల భాష పూర్తిగా తెలియని పిల్లలకు పెద్దలు చెప్పిన మాటలు అర్థము కావు. అప్పుడు వారికి భాష పూర్తి తెలియదని మనకు కూడా తెలిసి పోవుచున్నది. అదే జంతువులలో అయితే పుట్టిన గంటనుండి తల్లి జంతువు భాషను (సూచనలను) పిల్ల జంతువు గ్రహించుచున్నది. అంత చిన్న వయస్సులో ఏ అనుభవము లేకుండా ఆ పిల్ల జంతువు తల్లి భావమును ఎలా తెలియగలిగింది?**

**జవాబు :–** మనుషులు నీటిలో ఈదుటకు కొన్ని దినములు తర్ఫీదు పొందితే గానీ ఈతను నేర్వలేరు. నీటిలో ఈదుటకు కొంత తర్ఫీదు లేనిదే ఈదడము సాధ్యము కాదు. అటువంటిది చిన్న కుక్క పిల్లను నీటిలో వేస్తే ఎటువంటి తర్ఫీదు లేకుండా ఈదగలుగుచున్నది. మనుషులు శిశువులుగా తల్లి వడిలో యున్నప్పుడు మూడు నెలల వరకు తల్లిపాలు ఎక్కడున్నది శిశువు తెలియదు. తల్లి నోటిలో పెట్టి తాపితేగానీ వాడు తాగలేడు. అదే జంతువు పిల్ల అయితే పుట్టిన తర్వాత నిమిషమునకే తల్లి పొదుగును గుర్తించి పాలను త్రాగగలదు. మనిషి చిన్నతనములో నడక నేర్చుకొనే దానికి ఏడు నెలల నుండి రెండు సంవత్సరముల కాలము పట్టవచ్చును. అదే జింక పిల్లకు లేచి నడుచుటకు ఒక నిమిషము, పరిగెత్తుటకు రెండు నిమిషముల కాలము సరిపోవుచున్నది. మనుషులకు, జంతువులకు పోల్చుకొని చూస్తే ఇదంతా ఎలా జరుగుచున్నదను ప్రశ్న రాగలదు. దానికి ఒకే జవాబు చెప్పవలెనంటే ఇలా కలదు. జంతువులు కొన్ని విషయములను నేర్వవలసిన పని లేదు. నేర్వకుండానే వాటికి తెలిసిపోవులాగ వాటి శరీరములోనే అటువంటి నిర్మాణమును దేవుడు అమర్చియున్నాడు. ఇక్కడ దేవుడు అమర్చియున్నాడని దేవుని గౌరవార్థము చెప్పుచున్నాము. వాస్తవము చెప్పితే దేవుడు ఏమీ చేయలేదు గానీ, దేవుని తర్వాత యున్నవాడు, శరీరమునకు అధిపతిగా యున్నవాడు, జీవులందరినీ భరించువాడు ఎవడయితే యున్నాడో వాడే జంతువులకు చిన్నతనములోనే అన్నీ నేర్పి, అన్నిటినీ చేయించుచున్నాడు.

**4) ప్రశ్న :– ఒక భాషతో మాట్లాడితే భాషను విన్న తర్వాత వినిన వారికి భాషలోని భావము తెలియుచున్నది కదా! దీనినిబట్టి భాష ముందు, తర్వాత భావము అని తెలియుచున్నది కదా! అలాంటప్పుడు ముందు భాష, తర్వాత భావము అని వ్రాయక, మీరు గ్రంథము పై భాగమున గ్రంథము పేరులో**

**ముందు భావమును వెనుక భాషను వ్రాస్తూ "భావము-భాష" అని వ్రాశారు. అలా వ్రాయకూడదు కదా! ముందు భాష అని వ్రాసి తర్వాత భావము అని వ్రాయాలి కదా! వాస్తవముగా వ్రాయవలసినది "భాష-భావము" అని వ్రాసియుండవలెను కదా!**

**జవాబు :-** మేము వ్రాసిన "భావము-భాష" పదము తప్పుకాదు. ఏదయినా గ్రహించుటకుగానీ, బోధించుటకుగానీ ముందు పూర్తి విచక్షణా జ్ఞానముండి అన్ని విధముల అర్థము చేసుకొని, సత్యాసత్యములను నిర్ణయించుకొని ముందు భావము తర్వాత భాష ఉండులాగున **"భావము-భాష"** అని వ్రాశాము. దీనిని తప్పు అనుటకు ముందు మీరు ఇందులో గల సత్యా సత్యములను గురించి ఆలోచించారా? యని ప్రశ్నించుచున్నాను. మాకు నలభై సంవత్సరముల ఆధ్యాత్మిక జ్ఞాన అనుభవము ఉండుట వలన అనేక కోణములనుండి ఆలోచించి ముందు భావము వెనుక భాషయని వ్రాశాను. నేను వ్రాసిన దానికి ఆధారములు గలవు. మీరు అనుకొన్న విధముగా చాలామంది అనుకోవచ్చును. వారందరికి ఒకే జవాబు చెప్పుచున్నాను. నేను వ్రాసినది సత్యమే, మీరు వ్రాయునది సత్యమా? మీరు వ్రాయునది తప్పో కాదో ఒకటి చూడండి. తండ్రి మొదటి వాడయినా తల్లి రెండవదయినా వ్రాయడములో ముందు తండ్రిని వ్రాయక మొదట తల్లిని వ్రాసి తర్వాత తండ్రిని వ్రాయుచున్నారు. తల్లి తండ్రియని ఉండడము సరికాదని మేము కూడా చెప్పగలము. కైలాసములో ఈశ్వరుడు ముఖ్యమైనవాడు. ఆయన తర్వాత ఆయన భార్యను గురించి చెప్పవచ్చును. అయితే ముందు భాగములో ఈశ్వరున్ని వ్రాయక పార్వతి పరమేశ్వరులని ఈశ్వరున్ని వెనుక వ్రాయడము బాగాలేదని మీరు ఎందుకు చెప్పకూడదు? అలా వ్రాయడములో తప్పు పట్టవచ్చును కానీ, మేము వ్రాసిన "భావము-భాష" తప్పు పట్టడములో

అర్థము లేదు. బాగా ఆలోచించి చూస్తే నేను చెప్పినది సత్యమని తెలియగలదు.

ముందు మనిషి శరీరములో గుణముల ప్రేరణ జరుగుచుండును. గుణముల ప్రేరణలో గుణ విషయములను బుద్ధి పరిశీలించుచుండును. అప్పుడు కర్మ నిర్ణయము ప్రకారముగల విషయమును చిత్తము సూచించగా బుద్ధి దానినే తీసుకొని మనస్సుకు ఆ విషయమును అందించును. ఇది ఫలానా విషయమని దానిని పూర్తిగా తెలియజేసి, దానినంతటిని ఒక భావముగా చేసి మనస్సుకు ఇవ్వగా, మనస్సు ఆ విషయ భావమును ఇతరులకు తెలుపుటకు నాలుకకు అందించును. అప్పుడు నాలుక బుద్ధి లోపలనుండి అందించిన భావమును మనస్సు ద్వారా పొందినదై తనకు తెలిసిన భాషను ఉపయోగించి బయటికి మాటల రూపములో చెప్పును. అప్పుడు లోపలనుండి వచ్చిన భావమంతయూ మాటల భాష ద్వారా విన్నవారు గ్రహింతురు. ఈ కార్యములో మొదట గుణ భావము బుద్ధికి రాగా, తర్వాత కర్మప్రకారము చిత్తము చిత్తగించగా, చిత్తము ఒప్పుకొన్న దానిని బుద్ధి భావ రూపములో మనస్సుకు అందివ్వగా, మనస్సు జిహ్వకు (నాలుకకు) అందివ్వగా, అప్పుడు నాలుక భాషను ఉపయోగించి మాటల రూపములో చెప్పుచున్నది. ఈ విధానమంతా చూచిన తర్వాత మనిషిలో భావము మొదట పుట్టినదా, భాష మొదట పుట్టినదా? యని ప్రశ్నించితే, మనిషి శరీరములో తలయందుగల గుణములలో పుట్టినది భావము, తర్వాత చిత్తము, బుద్ధి, మనస్సు, నాలుక వరకు భావము చేరిన తర్వాత భాష పుట్టినది. దీనినిబట్టి చివరిలో పుట్టిన భాషకంటే మొదట పుట్టినది భావమేయని చెప్పవచ్చును. గుణములలో పుట్టిన భావము ఐదు జాగాలు మారి వచ్చి చివరకు భాష అయినది.

జిహ్వ వరకు వచ్చిన భావము మనిషికి తెలిసిన భాషలో బయటికి రాగా, దానిని వినువానికి ఆ భాష వచ్చియుంటే వానికి ఎదుటి వాని లోపల నుండి వచ్చిన భావము తెలియును. బయట భాషను వినేవానికి చెవులలో వినికిడి లోపమున్నా, చెప్పిన భాష తెలియకపోయినా, బుద్ధికి గ్రాహితశక్తి సరిగా లేకున్నా, వచ్చిన భావము రెండవ మనిషికి అనగా వినే మనిషికి సరిగా తెలియకుండా పోవును. అందువలన ఎదుటి మనిషికి వినే చెవులు, గ్రహించే బుద్ధి బాగున్నా, వానికి తెలిసిన భాష ఉంటేనే సమాచారము అతనికి చేరగలదు. ఒక్క భాష తెలియకపోతే భావము ఏమాత్రము తెలియుటకు అవకాశమే లేదు. అందువలన ఎదుటి వానికి తెలిసిన భాషలోనే చెప్పడము ముఖ్యము. వినికిడి సరిగా లేకున్నా, బుద్ధి గ్రాహితము సరిగా లేకున్నా, సమాచారము కొంత చేరకపోయినా మిగతా సమాచారమంతా తెలిసిపోవును. భాష తెలియకపోతే సమాచారము ఏమాత్రము తెలియదు.

**5) ప్రశ్న :- భాషను కొందరు 'మాతృభాష' యని అంటుంటారు. మాతృ భాష అనగా అర్థమేమి?**

**జవాబు :-** భాషయొక్క పుట్టుక స్థానమును మాతృ అని చెప్పవచ్చును. మాతృ భాషయని అనగా ఒక భాషకు తల్లిలాంటి భాషను మాతృభాషయని అనడము జరుగుచున్నది. అయినా నేడు మాట్లాడినంతగా అర్థమును తెలిసి మాట్లాడడంలేదు. ఒకరు అన్నమాటను విని ఇంకొకరు మాట్లాడడము జరుగుచున్నదిగానీ, పూర్తి అర్థము తెలిసి మాట్లాడడము లేదని తెలియు చున్నది.

**6) ప్రశ్న :- భాషకు మాతృస్థానము మనిషా లేక వేరే భాషనా? ఒక భాష**

**పుట్టుచున్నదంటే అది మనిషి ద్వారా పుట్టుచున్నదా? లేక భాష ద్వారా పుట్టుచున్నదా? ఇంకో విధముగా అడిగితే భాషకు పుట్టుక స్థానము ఇంకో భాషలోయుంటుదా? లేక మనిషిలోనే భాష పుట్టినదా? వివరముగా చెప్పండి.**

**జవాబు :-** మాతృభాష అంటే తల్లి భాషయని అర్థము. ఏ భాష అయినా మరియొక భాషనుండి పుట్టినదనియే అర్థము. ఒక భాషనుండి మరొక భాష కొద్దిగా మార్పు చెందుచూ ఇతర భాషగా మారిపోవుచున్నది. ఆ విధముగా మారిపోయిన భాషలు అనగా తయారయిన భాషలు ప్రపంచ మంతా చూస్తే 7105 భాషలున్నట్లు వినికిడి. అందులో 3570 భాషలు లిపి యున్నవని తెలియుచున్నది. విశ్వములో ఎన్ని భాషలున్నా ఒకదానికి ఒకటి పుట్టినవని చెప్పవచ్చును. ఈ విధముగా చెప్పితే ఒక భాష మరియొక భాషకు తల్లిగాయున్నది. తల్లి భాషనుండి మార్పు చెంది క్రొత్తగా తయారయిన దానిని పిల్ల భాషయని చెప్పవచ్చును. పిల్ల భాషకు మాతృభాష తప్పకయుండగా, మాతృభాషకు ఒకటిగానీ అంతకంటే ఎక్కువ గానీ పిల్లభాషలుండవచ్చును. ఒక తల్లికి ఒక బిడ్డయుండవచ్చును లేక ఇద్దరు, ముగ్గురు బిడ్డలుండవచ్చును. అలాగే ఒక భాషకు కూడా ఒకటిగానీ, లేక రెండు మూడుగానీ భాషలు తయారయి ఉండవచ్చును. లేకపోతే ఒక భాషే తయారయి ఉండవచ్చును. అంతకు ఒక భాషలేనిది ఇంకొక భాష పుట్టదని చెప్పవచ్చును.

**7) ప్రశ్న :- ఒక తల్లికి ఒక బిడ్డ పుట్టవచ్చు లేక ఇద్దరు, ముగ్గురు పుట్ట వచ్చును. వెనుక కాలమునకు పోవు కొలది అలాగే జరిగియుండవచ్చును. ఇంకా వెనక్కుపోతే సృష్ట్యాదిలో మనుషులే లేనప్పుడు తల్లే లేదు కదా! అప్పుడు మొదట స్త్రీ ఎలా పుట్టింది? మొదట స్త్రీ తయారయిన తర్వాత**

**ఆమెకు బిడ్డలు పుట్టియుంటారు. ఆ బిడ్డలు తల్లులు కాగా వారికి బిడ్డలు పుట్టియుంటారు. ఆ విధముగా నేడు జనాభా పెరిగిపోయినది. అట్లే మొదట సృష్ట్యాదిలో ఒక్క భాష కూడా లేనప్పుడు మొదటి భాష ఎలా పుట్టినది? దాని తర్వాత మొదటి భాషకు తర్వాత భాషలు పుట్టియుండ వచ్చును. స్త్రీకి సంతతి ఎలా తయారవుచూ వచ్చినదో అలాగే ఒక భాషకు మిగతా భాషలు తయారవుతూ వచ్చియుండును. అయితే మొదట భాష ఎలా తయారయినదో దానికి కారణము ఎవరో తెల్పవలెను?**

**జవాబు :–** సృష్ట్యాదిలో తల్లిలేదు. తల్లి లేకుండా బిడ్డ పుట్టడము జరిగినది. మొట్టమొదట ఎవరికీ తల్లితండ్రులు లేరు. ఆ స్థితిలో దేవుడు స్వయముగా తల్లితండ్రులు లేకుండా మనుషులను, ఆడ మగ జంతువులు లేకుండా జంతువులను, విత్తనములు లేకుండా వృక్షములను, అండము లేకుండా పక్షులను దేవుడు సృష్ఠించడము జరిగినది.

భూమిమీద జీవరాశులన్నీ మూడు రకముల పుట్టుకలతో గలవు. అండజములు కొన్ని, పిండజములు కొన్ని, ఉద్భిజములు కొన్ని గలవు. అండజములనగా గ్రుడ్డు నుండి పుట్టునవి. పిండజములనగా జంతువుల నుండి పుట్టినవి. ఉద్భిజములనగా విత్తనమునుండి పుట్టినవి అని చెప్పవచ్చును. ఇవన్నియూ సృష్ఠి తర్వాత కలుగుచున్న పుట్టుకలు. సృష్ఠి మొదటిలో అండము లేదు, పిండము లేదు, విత్తనము లేదు. సృష్ట్యాదిలో ఉత్పత్తి బీజములయిన అండ, పిండ, ఉద్భిజములు లేనప్పుడు ఆ మూడింటిని ఒక పెద్ద అండమునుండి నేరుగా పుట్టించడము జరిగినది. పెద్ద గ్రుడ్డును బ్రహ్మ+అండము అని అంటారు. బ్రహ్మ+అండమును కలిపి బ్రహ్మాండము అని చెప్పవచ్చును. బ్రహ్మాండమును దేవుడు

సృష్టించాడు. దేవుని సృష్టి అయిన బ్రహ్మాండము ద్వారా మూడు రకముల పుట్టుకలు గల మనుషులు, పక్షులు, వృక్షములు పుట్టినవి. మనుషులే కాక మనుషుల జతలో పిండజములుగా జంతువులు పుట్టాయి. పిండములు మనుషులు మరియు జంతువులు అని జోడిగా చెప్పవచ్చును. అలాగే అండములలో పక్షులే కాకుండా వాటి జతలో క్రిమి కీటకములు పక్షులకు జోడిగా పుట్టినవి. ఉద్భిజములలో వృక్షములే కాకుండా వాటికి జోడిగా తీగలు పుట్టినవి. ఈ విధముగా మూడు రకముల జీవరాశుల సృష్టి మొదట దేవుడు తన బ్రహ్మాండము ద్వారా తయారు చేశాడు. సృష్టి ఏమీ లేనప్పుడు దేవుడే స్వయముగా తన బ్రహ్మాండము నుండి శిశుదశ లేని, బాల్యదశ లేని మూడు రకముల జీవులను సృష్టించాడు. అలా సృష్టి జరిగిన తర్వాత అప్పుడు సృష్టింపబడిన జీవరాశులే మిగతా తమ జాతి జీవరాసులకు తల్లితండ్రులుగా మారునట్లు దేవుడు చేశాడు. మొదట సృష్టి తర్వాత దేవుడు ఏ కార్యమును (పనిని) చేయలేదు. దేవుని తర్వాతగల ఆత్మే అన్నిటికీ తల్లితండ్రులుగా అగోచరముగా యుంటూ, పైకి కనిపించే తల్లితండ్రులను సంతతికి కారణమయినట్లు చూపుచున్నది. అలాగే అనుకొంటే కనిపించే వాటి తల్లితండ్రుల వలన మిగతా మూడు రకముల జీవరాసులు పుట్టుచున్నవి.

ఇదంతయూ జీవరాసుల పుట్టుక యొక్క సృష్టి రహస్యమును తెలియ గలిగాము. దానిని అనుసరించి ఏ భాష లేనప్పుడు మొదటి భాష ఎలా వచ్చినదో, తర్వాత ఆ భాషకు మిగతా భాషలు ఎలా పుట్టినవో ఇప్పుడు తెలుసుకుందాము. అండ, పిండ, ఉద్భిజముల సృష్టి తర్వాత 1) మనుషులు, జంతువులు, 2) పక్షులు, కీటకములు, 3) వృక్షములు, తీగలు మూడు జోడు జాతులు పుట్టినట్లు తెలుసుకొన్నాము. మనుషుల సృష్టి జరిగిన

కొంత కాలమునకు  కృతయుగములోనే మొదట మనుషులకు దేవుడు జ్ఞానమును తెలియజేయు నిమిత్తము తన ప్రకృతిలో మొదటిదయిన ఆకాశము ద్వారా తెలుపపూనినాడు.  దేవుని తర్వాత దేవునిగా చెప్పబడు చున్న ఆత్మే  ఆ పనిని చేయపూనినది.  ఆత్మ చేయుచున్న ప్రతి పనిని దేవుడే చేయుచున్నాడని చెప్పడము సహజముగా ఉండును.  అయితే సృష్ఠి తర్వాత దేవుడు ఏమీ చేయక ఊరక ఉండిపోయాడు.  సృష్ఠిలో జరుగ వలసిన కార్యములన్నిటిని  తన పుత్రుడయిన ఆత్మే చేయునట్లు  అధికారమిచ్చి తాను ఊరక ఉండిపోయాడు.  దేవుడు సాక్షిగా ఉండగా  ఆత్మే అన్నీ చేయుచున్నది.  మనిషి చనిపోయిన తర్వాత జన్మకు పంపుటకుగానీ, మోక్షమునకు పంపుటకుగానీ ఆత్మే అధికారము దేవుని చేత పొందియున్నది. సృష్ట్యాదిలోనే ఆత్మకు అధికారమిచ్చిన దేవుడు తాను సాక్షిగా మౌనముగా చూస్తున్నాడు.  ఆత్మ మనుషుల నుండి మనుషులను, జంతువులనుండి జంతువులను, పక్షుల అండము నుండి పక్షులను, వృక్షముల బీజముల నుండి వృక్షములను పుట్టించుచున్నది.  అయినా తాను ఏమీ చేయనట్లు ఎక్కడా ఎవరికీ తెలియకయున్నది.  తెలియక శరీరములో అణిగియున్న ఆత్మను తెలియడమే **ఆత్మజ్ఞానము** అనీ, **ఆధ్యాత్మికము** అనీ అంటాము.

దేవుడు పని చేయనివాడై ఊరకయుండగా, ఆత్మే మనుషులకు జ్ఞానమును తెలియజేయుటకు పూనుకొని మొదట ఆకాశము ద్వారా  తన జ్ఞానమును, దేవుని జ్ఞానమును తెలియజెప్పాలనుకొన్నది.  ఆకాశము ద్వారా జ్ఞానమును ఆత్మ చెప్పడమైనది.  ఆకాశము ద్వారా శబ్దరూపములో జ్ఞానము విశ్వములో మొట్టమొదటిగా బయల్పడినది.  మొదట చెప్పబడిన దేవుని జ్ఞానమును ఆకాశ శబ్దము ద్వారా ఆత్మ చెప్పించగా,  ఆ శబ్దము ఆకాశము నుండి ఉరుముల రూపములో బయటికి వచ్చినది.  ఉరుముల శబ్దము

రూపములో వచ్చినది దైవజ్ఞానమే అయినా, దానిని అర్థము చేసుకొను స్థోమత మనుషులకు లేదు. ఉరుములలో గల ఉద్దేశ్యము ప్రజలకు జ్ఞానము తెలుపడమే అయినా, ఉరుముల భాష మనుషులకు అర్థము కానిదానివలన, మనుషులకు ఉరుముల ద్వారా చెప్పబడిన జ్ఞానము ఒక్క ముక్క కూడా అర్థము కాలేదు. అయితే ఉరుముల శబ్దములోని జ్ఞానమును ఆకాశములోని సూర్యగ్రహము వినగలిగినది. ఉరుముల శబ్దమును వినిన సూర్యుడు ఆ శబ్దములలోని జ్ఞానమును పూర్తిగా గ్రహించుకొన్నాడు. తాను గ్రహించుకున్న జ్ఞానమును, మనుషులు తెలిసిన భాషలోనికి మార్చి (అనువాదము చేసి) మనుషులకు చెప్పదలచాడు. ఆ ప్రయత్నములో భాగముగా మొట్టమొదట దక్షిణ భారతదేశములో గల "మనువు" అను వ్యక్తికి ఆకాశమునుండి వచ్చిన జ్ఞానమును చెప్పెను.

**8) ప్రశ్న :– సృష్ట్యాదిలో కొంత కాలము జరిగినా అప్పుడున్న మనుషులకు నాగరికత తెలియదు. ఆ కాలములో మనుషులలోనే కాక భూమిమీద ఎక్కడా 'భాష' అనునదిలేదు. ఆ కాలములో ఆకాశవాణి చెప్పిన జ్ఞానము భావముతో కూడుకొన్న శబ్దము అగుట వలన అది ఆకాశము యొక్క భాషయని చెప్పవచ్చును. ఆకాశము తన భాషలో, తన భావమును తెలుపగా అది మనుషులు వినగలిగినా, ఎవరికీ తెలియని భాషయగుట వలన ఆ భావములోయున్నది దేవుని జ్ఞానమే అయినా, అది మనుషులకు ఏమాత్రము అర్థము కాలేదు కదా! అలాంటప్పుడు ఆకాశము చెప్పిన భాషలోని జ్ఞానమును సూర్యుడు ఎలా గ్రహించి, అర్థము చేసుకోగలిగాడు? అంతవరకు భూమిమీద మనుషుల మధ్యలో మాట్లాడే భాషే లేదు. ఆకాశములో భావముతో కూడిన భాషగా వచ్చినది మొట్టమొదటిగా ఉరుముల శబ్దమే యని చెప్పవచ్చును. మొదట వచ్చిన భాష అయినందున**

**అది సూర్యునకు కూడా తెలియదు. తెలియని భాషలోని జ్ఞానమును సూర్యుడు ఎలా గ్రహించాడు? మొదట వచ్చిన ఆకాశ భాష సూర్యునకు తెలియకున్నా ఎలా గ్రహించగలిగాడు?**

**జవాబు :-** విశ్వమును సృష్టించిన సృష్టికర్తయైన దేవుడు తన సృష్టి శాశ్వితముగా కొనసాగుటకు తగిన విధానమును సృష్టిలో ఏర్పరచాడు. తన పథకము ప్రకారము **పాలించు జీవులు, పాలించబడు జీవులు** అని రెండు రకములుగా జీవులను తయారు చేశాడు. అందులో పాలించబడు వారు ఒక విభాగము కాగా, పాలించువారు మరొక విభాగముగాయున్నారు. పాలించబడు జీవులన్నీ అండజ, పిండజ, ఉద్భిజములుగా యున్నవి. పాలించు జీవులు అండము నుండి గానీ, పిండమునుండి గానీ, ఉద్భిజము నుండిగానీ పుట్టవు. వారికి మనుషులవలె జన్మలు, మరణములు ఉండవు. సృష్టితో పాటు బ్రహ్మాండమునుండి పుట్టిన పాలకులు స్థిరస్థాయిగా ఉండి దేవుడు అప్పగించిన పనిని చేయుచుందురు. మనుషులు, జంతువులు, పక్షులు, కీటకములు, వృక్షములు, లతలు (తీగలు) అనునవే కాకుండా సముద్ర జీవులతో సహా చచ్చిపుట్టుచుండును. అయితే మహా భూతములుగా, భూతములుగా, గ్రహములుగా, ఉపగ్రహములుగా ఉన్న జీవులకు చావు పుట్టుకలుగానీ, సుఖదుఃఖములుగానీ లేవు. దేవుని సేవ నిమిత్తము అనగా దేవుని పరిపాలన నిమిత్తము భూతములు, గ్రహములు అను రెండు విధములైన వారు తయారుచేయబడ్డారు.

భూతములకు, గ్రహములకు శరీరములు ఉన్నాయి. అయినా అవి గుర్తింపుకు మాత్రమే ఉండుట వలన ఆ శరీరములో గ్రహములు భూతములు ఉండవచ్చును, ఉండకపోవచ్చును. పాలనా నిమిత్తమై

గ్రహములు, భూతములు కొన్ని సమయములలో శరీరమును వదలి బయటికి రావలసి యుండును. అలా వచ్చినా వారి శరీరములు నాశనము కానివై ఉండును. భూతములకు, గ్రహములకు అనేక ఆకారములలో శరీరములుండును. మనుషులవలె కాక భూతములు దూరశ్రవణము, దూరదృష్ఠి కలిగి యుండడమేకాక వేగవంతమైన ప్రయాణమును కూడా చేయగలవు. అందువలన సూర్యుడు ఆకాశములో ఎంతో దూరమునుండి వచ్చి మనువుకు కృతయుగములో జ్ఞానమును చెప్పాడు. సూర్యగ్రహము తన స్థూలశరీరము అయిన మండే గోళమును వదలి, సూక్ష్మముగా భూమిమీదికి వచ్చి చెప్పవలసిన జ్ఞానమును చెప్పి పోయాడు. కృతయుగములో ఒకమారు, కలియుగములో ఒకమారు సూర్యుడు భూమిమీదికి వచ్చి పోవడము జరిగినది. భూతములకు, గ్రహములకు కొన్ని ప్రత్యేకతలను ఇచ్చి దేవుడు సృష్ఠించాడు. ఒకటి శరీరమును వదలి ఎంతదూరమైనా రావడము ఒక ప్రత్యేకతకాగా, భూమిమీద గానీ, ఆకాశములోగానీ ఏ భాషలో ఎవరు మాట్లాడుచున్నా, ఆ భాషలోని భావమును గ్రహించుశక్తి కూడా దేవుడిచ్చాడు. అనగా ఏ భాషను ఎవరు మాట్లాడినా ఆ భాషను గ్రహించు స్థోమత గ్రహములకు, భూతములకు గలదు. దీనినిబట్టి అన్ని భాషలు వారికి తెలియునని, వారికి తెలియని భాషలు లేవని చెప్పవచ్చును. ఈ స్థోమత యుండుట వలన ఆకాశ శబ్దములోని భాషను తెలిసి అందులోని జ్ఞానమును గ్రహించి మనుషులు తెలియు భాషలో సూర్యుడు చెప్పగలిగాడు. పాలనలోని గ్రహములు, భూతములు ఏ భాషనయినా వినగలవు. ఏ భాషనయినా మాట్లాడగలవు. ఎంత క్రొత్త భాష అయినా వారు సులభముగా గ్రహించగలరు, అట్లే మాట్లాడగలరు.

అందువలన మొట్టమొదట మాట్లాడిన ఆకాశ భాషను సూర్యుడు గ్రహించగలిగాడు. అలాగే మొదట భూమిమీద పుట్టిన తెలుగు భాషతో మాట్లాడగలిగాడు. సూర్యుడు మొదట వినిన భాష ఆకాశ భాష, ఆకాశ భాష ఉరుముల శబ్దముతో కూడుకొనియున్నది. భూమిమీద మొట్టమొదట పుట్టిన భాష తెలుగు భాష. సూర్యుడు మాట్లాడిన మొదటి భాష తెలుగు భాషయే. మనుషులయిన మనకు తెలిసిన భాషను గ్రహములు, భూతములు సులభముగా తెలియగలవు, మాట్లాడగలవు. భూమిమీద మొట్టమొదట కృతయుగములోనే మనుషులు కొంత తెలివిని ఉపయోగించి భావములను ఒకరికొకరు తెలుపు నిమిత్తము భాషను ఏర్పరచుకొన్నారు. అలా ఏర్పరచు కొన్న భాషయే తెలుగు భాష. తెలుగు భాష సృష్ఠిలో మొదట తయారుకాగా తర్వాత కొంత కాలమునకు దానిని అనుసరించి దక్షిణ భారతదేశ భాషలయిన కన్నడ, తమిళము, మళయాలము, మరాఠీ, ఒరియా భాషలు తయారయినవి. తర్వాత ఒక దానికి ఒకటి మాతృభాషగాయుంటూ మిగతా భాషలు తయారగుచూ వచ్చాయి. ఆ విధముగా తయారగుచూ నేటికి ప్రపంచములో 7105 భాషలున్నట్లు గుర్తించారు. ఇందులో లిపి ఉన్నవి 3570 భాషలుకాగా, మిగతావన్నీ లిపి లేనివిగానే లెక్కించవలెను. మనకు తెలుగు తప్ప ఇతర భాషలు తెలియవు. కొందరికి రెండు నుండి పది భాషలు వచ్చిన వారు కూడా యున్నారు. పది లేక పదిహేను భాషలకంటే ఎక్కువ భాషలు వచ్చిన మనుషులు ఎవరూ లేరు. అయితే గ్రహాలుగానీ, భూతములుగానీ భూమిమీద గల మనుషులు మాట్లాడే 7105 భాషలను అర్థము చేసుకోగలరు, మాట్లాడగలరు. దేవుడు సృష్ఠించిన తన పాలకులకు దేవుడు అన్ని భాషలను గ్రహించుశక్తిని ఇచ్చాడు. దేవుని చేత సృష్ఠింపబడిన భూతములకు, గ్రహములకు భూమిమీద అన్ని భాషలను గ్రహించుశక్తిని

దేవుడు ఇచ్చాడు. దేవుడు సృష్ఠించిన మనిషికి మాత్రము భాషలు నేర్చితే గానీ తెలియవు. అదే దేవుడు సృష్ఠించిన పాలకులయిన భూతములకు, గ్రహములకు నేర్వకున్నా భాషలన్నీ తెలియునట్లు చేశాడు. అందువలన గ్రహములు, భూతములు అన్ని భాషలను విని తెలియునట్లు, తెలిసి మాట్లాడునట్లు చేశాడు. తన ప్రతినిధియైన ఆత్మ విషయమునకు వస్తే భాషలతో సంబంధము లేకుండా నేరుగా భావమును గ్రహించు విధానమును అందించాడు. తనతోపాటు తీర్పు తీర్చు అధికారమును తన కుమారుడైన ఆత్మకు ఇచ్చినట్లు, తనకు గల భావమును గ్రహించు అధికారమును తన ఆత్మకు కూడా దేవుడు ఇచ్చాడు. దేవునికి భాషలతో పని లేకుండా ఎవరి భావమునయినా గ్రహించు అధికారము గలదు. అందువలన మనుషుల అంతరంగములోని భావములను మనిషి చెప్పకనే దేవుడు గ్రహించగలడు. మనిషి హృదయాంతరాలములోని రహస్యమును కూడా దేవుడు గ్రహించ గలడు. అదే విధానమునే తన కుమారుడైన ఆత్మకు అనుగ్రహించి యుండుట వలన మనిషి బయటికి చెప్పకనే అంతరంగములో రహస్యముగా ఉంచు కొన్న విషయమును ఆత్మ కూడా సులభముగా తెలియగలదు.

భావమును తెలియుటలో మనుషులను ఒక రకము, భూతములను, గ్రహములను మరొక రకము, దేవుడు ఆత్మ ఇంకొక రకము మొత్తము మూడు రకములున్నట్లు తెలియుచున్నది. మనిషి నేర్చితేగానీ భాషను తెలియలేడు. అందువలన దేవుడు సృష్ఠించిన పాలింపబడు వారందరిలోను భాషను నేర్చితే తెలియడము ఒక రకము, దేవుడు సృష్ఠించిన పాలించు పాలకులనబడు వారిందరిలోనూ భాషను నేర్చకపోయినా తెలియడము ఒక రకము, చివరిలో దేవుని చేత సృష్ఠింపబడిన తన ప్రతినిధియైన ఆత్మ మరియు దేవుడైన తాను ఇద్దరు భాషతో నిమిత్తము లేకుండా నేరుగా

భావమును గ్రహించుట ఒక రకము మొత్తము మూడు రకములు దేవుడు నిర్మించియున్నాడు. ఈ విధానము సృష్ట్యాదినుండి కొనసాగుచున్నది. ఇది దేవుడు నిర్ణయించిన విధానము అయినందున దీనిని ఎవరూ అతిక్రమించుటకు వీలులేదు. దేవుడు కలుగజేసిన ఈ విధానమునుబట్టి సూర్యుడు ఆకాశ శబ్దమయిన ఉరుముల భాషను గ్రహించగలిగాడు. ఉరుముల భాషలోని భావమును పూర్తిగా తెలియగలిగాడు. తాను తెలిసిన భావమును తిరిగి మనుషుల భాషలో తెలియజేశాడు.

**9) ప్రశ్న :- మనుషుల భాషలు పూర్వము ఒక్కదానితో మొదలయి, దాని ద్వారా అనేక భాషలు తయారయినాయి అని చెప్పారు. అయితే అలా తయారయిన భాషలు నేడు 7105 ఉన్నాయని కూడా చెప్పారు. మొదట తయారయిన భాష తెలుగు భాషయని చెప్పారు. "భూమిమీద తెలుగు భాష కూడా లేని సమయములో ఆకాశము తన మేఘములతో శబ్దము చేసి, తన భావమును ఉరుముల శబ్ద భాషతో తెలియజేసినది" అని అన్నారు. మీరు చెప్పిన ప్రకారము తెలుగు భాష పుట్టకముందే ఆకాశ భాష పుట్టి యుంటే దానిని మొదటి భాషయని మీరు చెప్పాలి. ఆకాశ శబ్దము ద్వారా వచ్చిన ఆకాశ భాష మొదటి భాషయని తెలిసినా, దానిని మొదటి భాషయని చెప్పకుండా, భూమిమీద మనుషుల మధ్యలో పుట్టిన తెలుగు భాషనే మొదటి భాషయని చెప్పడములో మీ అంతర్యమేమిటి?**

**జవాబు :-** ఇంతకుముందే దేవుడు మూడు విధముల గ్రాహితములను ఏర్పరచాడని, అందులో పాలించబడు వారందరికీ ఒక విధానము, పాలించు వారందరికీ మరొక విధానమును ఏర్పరచి, సృష్టికర్తయిన దేవుడు, దేవుని ప్రతినిధియైన ఆత్మ ఇద్దరు ప్రత్యేకమయిన విధానమును కల్గియున్నారని

చెప్పాము. మూడు భాగములుగా యున్న వీరిలో మనుషులు మొదటి భాగములోనికి, ఆకాశము రెండవ భాగములోనికి వచ్చుచున్నవి. మనుషులు పాలించబడువారు, ఆకాశము పాలించునది. అందువలన వీరికున్న భాషను గ్రహించు విధానములు వేరువేరుగా ఉన్నాయి. దీనినిబట్టి గ్రహముల భూతముల భాషలు వేరు, మనుషుల జంతువుల భాషలు వేరు. పాలకులయిన గ్రహముల భూతములలో ఆకాశ భాష మొదటిదయి వుండవచ్చునుగానీ, పాలించబడు మనుషులలో మొదటి భాష తెలుగు మాత్రమే. అందువలన భూమిమీద తొలిభాష తెలుగు భాషయని చెప్పాము. మన **తెలుగు భాష** మనుషుల పాలిట **జ్ఞాన వెలుగు భాష** అయినది. ఆకాశ భాషను మనుషుల భాషలలో చేర్చలేదు. అందువలన ఆకాశ భాష అయిన ఉరుముల శబ్దము తొలి భాష అయినా దానిని గురించి చెప్పక మనుషుల భాషను తొలి భాషయని చెప్పాము.

**10) ప్రశ్న :- దేవునికి భాష లేదా? భాష రాదా?**

**జవాబు :-** దేవునికి భాషతోనే సంబంధము లేదు. భాష దేవుని చేత సృష్ఠించబడిన వారికి మాత్రమే లెక్కించబడును. దేవుని చేత పుట్టించబడిన వారు మాత్రమే భాషను ఉపయోగించుకొనుచుందురు. వారికి మాత్రమే భాష ఉపయోగపపడుచున్నది. దేవునికిగానీ, దేవుని ప్రతినిధియైన ఆత్మకుగానీ భాషతో సంబంధము లేదు. భాషకంటే ముందుగల భావముతోనే ఆత్మకు, దేవునికి సంబంధము. దేవున్ని ఎప్పుడుగానీ భాషతో సంబంధము పెట్టకూడదు.

**11) ప్రశ్న :- కొందరు కొన్ని సందర్భములలో సంస్కృతమును దైవ భాష అని అనుచుండగా వినియున్నాము. వారిమాట అసత్యమంటారా?**

**జవాబు :–** లేని భాషను ఉందని అంటే వారిమాటను అసత్యమని అనకుండా ఏమనాలి? దేవునికి భావమునకు సంబంధముగానీ, దేవునికి ఏ భాషతో సంబంధము లేదు. దేవుడు భాషకు అతీతుడు కావున నేను ఎవరితోనూ మాట్లాడనని చెప్పాడు. దేవుడు ఏ భాషలోనూ ఎవరితోనూ మాట్లాడలేదు.

**12) ప్రశ్న :– కొన్ని దేవాలయములలో దేవునికి సంస్కృత భాష తప్ప ఏమీ తెలియదు అన్నట్లు సంస్కృత భాషలోనే మంత్రములు చెప్పడము, సంస్కృత ములోనే సమర్పణ చేయడము చేయుచుందురు. సంస్కృతము తప్ప గుడిలోని దేవునికి వేరే భాష రాదా?**

**జవాబు :–** ఇంతకు ముందు దేవుని విషయమును అడిగావు. దానికి జవాబు చెప్పాము. ఇప్పుడు నీవు దేవాలయములోని అనగా గుడిలోని దేవుళ్ళ విషయము అడుగుచున్నావు. అందువలన ఇక్కడ నేను కొంత వివరముగా చెప్పవలసిన అవసరమున్నది. అట్లే నీవు కూడా కొంత విచక్షణతో తెలియవలసియున్నది. సృష్టికర్త అయిన దేవుడు తన సృష్టిని రెండు విధములుగా సృష్టించాడనీ, ఒకరు పాలించువారు, మరొకరు పాలించ బడువారని చెప్పాము. పాలించు వారిలో మహాభూతములు, భూతములు, గ్రహములు, ఉపగ్రహములు గలరు. మహాభూతములు ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను ఐదు మాత్రమే గలవు. తర్వాత భూతములు లెక్కలేనన్ని గలవు. గ్రహములు పన్నెండు మాత్రమే ఉండగా, ఉపగ్రహములు అనేకము గలవు. అన్నిటినీ కలిపి చెప్పితే కొన్ని కోట్ల సంఖ్యలో గలవు. ఎన్ని కోట్లని సంఖ్యను చెప్పలేముగానీ కనీసము వందకోట్లకు తక్కువ లేవని చెప్పవచ్చును. మరొక లెక్క ప్రకారము 108 కోట్లు గలవనీ అందులో 54 కోట్లు భూతములుకాగా, 54 కోట్లు గ్రహములని చెప్పవచ్చును. ఇదంతయూ దేవుని సృష్టిలోని ఒక విభాగము యొక్క వివరము మాత్రమే.

రెండవ విభాగమయిన పాలించబడువారు అండజ, పిండజ, ఉద్భిజములని చెప్పాము కదా! వీరిలో మనుషులు జంతువులు పిండజములు అని, పక్షులు కీటకములు అండజములు అని, వృక్షములు తీగలు ఉద్భిజములు అని మాత్రము తెలుసు. అయితే ఇవి కనిపించునవి మాత్రమే. మనుషులను పోలిన దేవతల జాతియని చెప్పబడు కనిపించని సూక్ష్మముగా యున్న వానిని దేవుడు పాలించబడు వారిలోనే సృష్టించాడు. నేడు హిందువులుగా యున్న వారందరూ దేవాలయములలో పూజించు ప్రతిమలలో దేవతలు చేరి మనుషుల చేత పూజించబడుచున్నారు. దేవుడు, భక్తి అనువారందరూ సృష్టికర్తయిన దేవున్ని తెలియక, దేవుని చేత సృష్టింపబడిన దేవతలను ఆరాధించుచున్నారు. ఈ దేవతలను అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో 'జిన్నులు' అను పేరుతో చెప్పారు. జిన్నులు లేక జిన్నాతులు అని చెప్పబడు దేవతా జాతిని దేవుడు సృష్టించాడు. ఖురాన్ గ్రంథములో సూరా 51, ఆయత్ 56లో ఈ విషయమును చెప్పియున్నారు చూడండి.

**(51-56) "నేను జిన్నాతులను, మానవులను సృష్టించినది కేవలము వారు నన్ను ఆరాధించటానికే."**

సూక్ష్మముగాయున్న జిన్నాతులు (దేవతలు) స్థూలముగా యున్న మనుషులు తమను సృష్టించిన దేవున్ని ఆరాధించవలసి యుండగా, మనుషులు గుడులలోని ప్రతిమలయందు చేరియున్న జిన్నాతులను (దేవతలను) ఆరాధించుచున్నారు. మనుషులు దేవతలను ఆరాధించడము మొదటి యుగమునుండి అలవాటుపడ్డారు.

తమను సృష్టించిన సృష్టికర్తను మరచిపోయిన మనుషులు, దేవతలు ఇరువురు పాలింపబడు విభాగములోని వారే. ఒక విధముగా అర్థము

చేసుకొంటే దేవతలు కూడా మానవజాతికి సంబంధించిన వారే. కనిపించని వారిని దేవతలు అంటున్నాము. కనిపించే వారిని మనుషులు అని అంటున్నాము. దేవతలకు చావు, పుట్టుకలు, జీవితము అన్నీ సూక్ష్మముగా యుండును. మనుషులకయితే స్థూలముగా ఉండును. అంత తప్ప దేవతలకు మనుషులకు ఏమీ తేడా లేదు. అన్ని విషయములు మనుషులకున్నట్లే యుండును. పాపపుణ్య కర్మలను అనుభవించడము, సంపాదించడము రెండు మనుషులకున్నట్లే దేవతలకు కూడా యుండును. అలాగే మాట్లాడే భాష కూడా దేవతలకు ఉండును. అందరినీ పుట్టించిన దేవునికి భాషలేదు గానీ, సృష్ఠించబడిన దేవతలకు భాష కలదు. దేవతలు ఏ ప్రాంతము వారికి ఆ ప్రాంత భాష మాత్రమే తెలియును.

ఒక ప్రాంతములో తెలుగు మాట్లాడు ప్రజలుంటే ఆ ప్రాంతములోని గుడిలో గల దేవతకు మనుషులు మాట్లాడు తెలుగు వచ్చును. తెలుగు మనుషులు గుడికి వచ్చి పోవుట వలన దేవతలకు తెలుగు భాషనే వచ్చును. తమిళనాడు రాష్ట్రములో ఒక గుడిలోని దేవత ఇతరుల మీదికి వచ్చి మాట్లాడునప్పుడు తమిళమే మాట్లాడుటను చూచాను. అలాగే ఆంధ్రరాష్ట్రములో కొన్ని గుడులలోని దేవతలు మాట్లాడునప్పుడు తెలుగులోనే మాట్లాడడమును చూచాను. మనము తమిళనాడుకు పోయి అక్కడి దేవతతో మాట్లాడవలెనని ప్రయత్నించినా, ఆ దేవతకు తెలుగు తెలియదు, కావున తెలుగులో మాట్లాడలేదు. ఆమె తమిళములో మాట్లాడినా అది మనకు అర్థము కాదు. అదే విధముగా తెలుగు రాష్ట్రములో నేను చాలామంది దేవతలతో అక్కడక్కడ మాట్లాడడము జరిగినది. అప్పుడు వారు తెలుగు మాట్లాడినా ఆ ప్రాంతములో మాట్లాడు యాసలోనే మాట్లాడడము చూచాను. తెలంగాణలో అక్కడి తెలంగాణ యాసలో అక్కడి దేవతలు మాట్లాడడము,

రాయలసీమ ప్రాంతములోని దేవతలు రాయలసీమ ప్రాంత యాసలో తెలుగు మాట్లాడడము చూచాను. దీనినిబట్టి ఏ ప్రాంతము వారికి ఆ ప్రాంత భాషే అలవాటై యున్నదని తెలియుచున్నది.

కొన్ని దేవాలయములలోని ముఖ్యమైన దేవతలు కూడా నాతో మాట్లాడడము జరిగినది. అప్పుడు వారిని నేను కొన్ని ప్రశ్నలు అడుగడము జరిగినది. నిత్యము పూజలు చేయు పూజార్లు సంస్కృతములో మంత్రములు చదువుచుందురు కదా! అప్పుడు ఆ మంత్రములు మీకు అర్థమగుచుండునా యని అడుగగా! **"మాకు తెలుగు భాష మాత్రము తెలియును. చిన్నప్పటి నుండి తెలుగు భాష అలవాటై పోయినది. సంస్కృతమును అప్పుడప్పుడు పూజలలో మాత్రము వింటున్నాము. ఆ భాష మాకు తెలియని దానివలన వారు ఏమి చెప్పుచున్నారో ఏమాత్రము తెలియదు. చూడంగ, చూడంగ చెప్పు సంస్కృతములోని కొన్ని మాటలకు అర్థము తెలియును. అంత తప్ప మిగతాది ఏమో అర్థము తెలియదు. 'స్వాహా' అంటే అయిపోయింది అని, 'సమర్పణ' అంటే ఇస్తున్నాము అని ఇలాంటి కొన్ని ముఖ్యమైన పదములకు అర్థము తెలియును. మిగతావి ఏమో తెలియదు. వారి పద్ధతి ప్రకారము వారు పూజలు చేయుచున్నారని అనుకొందుము. మిగతా మాటలలో ఏమి చెప్పునది మాకు ఏమాత్రము తెలియదు"** అని అన్నారు.

**13)** ప్రశ్న :- **పెద్ద దేవాలయములు, చిన్న దేవాలయములు అని రెండు విధముల ఉండును. పెద్ద దేవాలయములలో మహా దేవతలుందురని, చిన్న దేవాలయములలో క్షుద్ర దేవతలుందురని కొందరు చెప్పుచున్నారు. అందులో ఏ దేవాలయములో మీరు అడిగి మాట్లాడారో?**

**జవాబు :-** పెద్ద దేవాలయములో అడిగినప్పుడే ఈ విధముగా చెప్పారు.

నేను చిన్న పెద్ద దేవాలయములలోని దేవతలతో అనేకమార్లు మాట్లాడినాను. మీరు అనుకొన్నట్లు పెద్ద దేవాలయములలో మహా దేవతలు, చిన్న దేవాలయములలో క్షుద్రదేవతలు ఉంటారనుకోవడము పొరపాటు. ఏ దేవాలయములో ఎవరయినా ఉండవచ్చును. వారి కర్మనుబట్టి వారికి చిన్న పెద్ద ఆలయములు లభించియుండును. గ్రామ దేవతలను క్షుద్ర దేవతలని, మిగతా దేవతలను మహా దేవతలని అనడము పరిపాటిగా యున్నది. అంతేకానీ ఆలయములనుబట్టి వారిని ఫలానాయని చెప్పలేము. హైదరాబాద్‌లో జూబ్లీహిల్స్‌యందు పెద్దమ్మ దేవాలయము పెద్దగానే యున్నది. అయితే ఆలయమునుబట్టి అక్కడున్న పెద్దమ్మను మహాదేవతయని చెప్పలేము. పెద్దమ్మ గ్రామదేవత కావున ఆమెను క్షుద్రదేవత అని చెప్పవచ్చును. కొన్నిచోట్ల చిన్న దేవాలయములలో ఆంజనేయస్వామి కలదు. ఆలయము చిన్నదని అక్కడున్న ఆంజనేయస్వామిని క్షుద్రదేవత అని చెప్పలేము. ఆంజనేయుడు గ్రామదేవత క్రిందికి జమలేదు, కావున మహా దేవత క్రిందికే చెప్పవలెను. బాగా పూజలు జరుగుచూ ఆర్థికముగా బాగున్న ఆలయములలోని దేవతలు తృప్తిగానేయున్నారు. వారికి నిత్యము నైవేద్యము పేరుతో ఆహారము దొరుకుచున్నది. వారి ఆకలి తీరుచున్నది. కొన్ని చిన్న ఆలయములలో నైవేద్యము పెట్టని ఆలయములలో అక్కడున్న దేవతలు ఆకలితో ఇబ్బందిపడుచున్నారు. వారు ప్రతిమను వదలి ఊరిలోనికి పోయి కొన్ని ఇళ్ళలో ఆహారమును తిని వస్తున్నారు. వారికి నిత్యము ఆహారమును వెతుక్కోవలసిన దుర్భర పరిస్థితి కలదు. అటువంటి దేవాలయములలోని ఒక ఆడ దేవత నాతో “నాకు ఇక్కడ చాలా కష్టముగా యున్నది. పూజారి వచ్చి మంత్రాలు చదివి దీపము సమర్పయామి, దూపము సమర్పయామి, నారికేలము సమర్పయామి, అని ఉత్త మంత్రములు చదివి పోవడము తప్ప మంత్రముల ప్రకారము దూపము గానీ, దీపముగానీ

ఉండదు. పేరుకు నారికేల సమర్పయామి, నైవేద్యము సమర్పయామి అనడము తప్ప అక్కడ నారికేలము ఉండదు, నైవేద్యము ఉండదు. ఇలాంటి చోట ఆహారము లేకుండా ఎన్ని రోజులుండాలి. అందువలన నేను ఎక్కువ రోజులు గుడిలోకంటే బయటే గడుపుతుంటాను. మీరయినా దయతలచి మాకు ఆకలి తీరే ఏర్పాటు చేయండి" అని అడిగిన సందర్భములు గలవు.

అలా నాతో చెప్పిన దేవతకు నేను ఒక సలహా ఇస్తూ "నీవు తమిళనాడుకు దగ్గరగా యున్నావు. తెలుగువాళ్ళు నిన్ను సరిగా చూడనప్పుడు తమిళనాడుకు పో. అక్కడ వాళ్ళు మంచి భక్తి కలవారుగా యున్నారు. చిన్న గుడిలో కూడా తప్పకుండా నైవేద్యము పెట్టే అలవాటున్నది" అని చెప్పాను. అప్పుడు ఆ దేవత "నాకు భాషరాదు కదా!" యని చెప్పినది. దానికి నేను బదులు చెప్పుచూ "నీకు భాషతో పనే లేదు. ఎవరితోనయినా మాట్లాడాలనుకొన్నప్పుడు భాషతో అవసరము. కొన్నాళ్ళు మాట్లాడకుండా వుండు. అక్కడి ప్రజలు నిత్యము మాట్లాడే మాటలు వింటూ వుంటే భాష తొందరగా వస్తుంది. అక్కడ ఏదయినా గుడి ఖాళీగా ఉంటే చూచుకొని వెళ్ళిపో!" అని చెప్పాను. ఈ విధముగా కొన్నిచోట్ల గుడిలోని దేవతలు కూడా ఇబ్బందులు పడుచున్నారు. వారు మనలాంటి వారే. వారు దేవతలని వారిని గొప్పగా భావించుకొన్నా, వారియందు ఆ గొప్పతనము ఏమీ ఉండదు. వాళ్ళు కూడా బ్రతుకు తెరువు కొరకు చాలా కష్టాలు పడుచున్నారు. దేవతలలో కూడా ధనికులు ఉన్నారు, పేదవారు ఉన్నారు. నిత్యము ఆకలితో బాధపడువారు ఉన్నారని మరువకూడదు.

**14) ప్రశ్న :– దేవతలు మనుషులు దేవుడు పుట్టించిన వారేయనీ, పాలింప బడువారనీ, వారు తప్పక భాషను నేర్వవలసిందేననీ, మనుషులకు వచ్చినట్లే**

**దేవతలకు కూడా భాషలు ఒకటి రెండు మాత్రమే వచ్చుననీ, రెండు భాషలు వచ్చిన దేవతలు అరుదుగా ఉందురనీ, మనుషులవలె దేవతలలో కూడా తెలివైనవారు, తెలివి తక్కువవారు ఉన్నారనీ, దేవతల జాతి కనిపించక సూక్ష్మముగా ఉన్నదని మీరు చెప్పగా మేము విన్నాము. అయితే ఈ దేవతల జాతి అండజములా, పిండజములా? అని అనుమానము వచ్చినది. దీనికి మీరేమంటారు? అంతేకాక దేవతలు వారిలో వారు మాట్లాడుకొను చుందురా? మాట్లాడుకొంటే వారు మనుషులకు తెలియని ఏ భాషలోనయినా మాట్లాడగలరా? లేక మనుషులకు తెలిసిన ప్రాంతీయ భాషలోనే మాట్లాడుకొనుచుందురా? మరొక్క విషయము మనకు చదువు వచ్చినట్లు వారికి చదువు వచ్చునా? మాకు కల్గిన ప్రశ్నలకు వివరముగా చెప్పగలరని అడుగుచున్నాము?**

**జవాబు :-** మీరు ఈ ప్రశ్నలలో అడిగినది ఒకటి దేవతలు తెలివి తక్కువ వారా? రెండు వారి పుట్టుక, మూడు వారి భాష, నాలుగు వారికి చదువు వచ్చునా? ఈ నాలుగు ప్రశ్నలకు వివరము కావాలంటే భాషను గురించి ఇంతకుముందే కొంత వివరముగా చెప్పియున్నాము. అయితే ఇందులో వారికి ప్రత్యేకమయిన భాష ఏదయినా ఉన్నదా?యని అడిగారు. అలా ఉంటే ముందే చెప్పియుండేవారము. వారికి ప్రత్యేక భాష ఏదీ లేదు. వారు దేవత జాతి అయినా మనుషుల జాతితో సమానముగానే యున్నారు తప్ప ప్రత్యేకించి భాషలేదు, ప్రత్యేకమయిన జీవితము లేదు. వారు మనుషులవలె నాగరికులు యున్నారు, అనాగరీకులు యున్నారు. తెలివైన వారు ఉన్నారు, తెలివి తక్కువ వారుయున్నారు. మనుషులకంటే హీనమైన భావములున్నవారు గలరు. మనుషులలో ఇతరుల తప్పును ఓర్చుకొని పోవు స్వభావమున్నా, దేవతలలో ఇతరుల తప్పును ఏమాత్రము ఓర్చుకోక

వారిమీద కక్ష సాధించాలను భావముండుట చాలా హేయమైన పని, మనుషులకంటే నీచముగా యోచించు పనియని చెప్పవచ్చును. తెలిసి చేసినదికాక తెలియక చేసిన తప్పును కూడా ఎక్కువగా లెక్కించి ప్రతీకారము తీర్చుకోవాలనుకొనుట దేవతలలో కలదు. ఇక పుట్టుక విషయానికి వస్తే సూక్ష్మముగా అయినా వారు మనుషులవలె పిండజములేయని తెలియవలెను. వారికీ బాల్యము, యవ్వనము, కౌమారము, వృద్ధాప్యము అను దశలు మానవులకున్నట్లే గలవు. వారిలో రెండు భాషలు వచ్చిన వారు చాలా అరుదుగా ఉందురు. అట్లే మనుషులకు వచ్చినట్లు వారికి చదువు రాదు. మనుషులకున్నట్లు వారికి పాఠశాలలు లేవు. అందువలన దేవతలకు చదువు రాదనియే చెప్పాలి. ఎక్కడయినా ఒకరు ఆసక్తితో చదువగల స్థోమత గలవారు గలరు.

**15) ప్రశ్న :- భగవద్గీతను సంస్కృత శ్లోకములలో వ్యాసుడు వ్రాశాడంటే, సంస్కృత భాష వ్యాసునికి ఇష్టమైనదా? దేవునికి ఇష్టమైనదా?**

**జవాబు :-** సంస్కృత భాష దేవునికి ఇష్టమైనది అనడములో అర్థమే లేదు. దేవుడు మనుషుల స్థాయికి దిగితేనే భాషలను చూడగలడు. దేవుడు దేవుని స్థాయిలో ఉంటే ఆయనకు ఏ భాషతో సంబంధము లేదు. ఆయనకు భావముతోనే సంబంధమని ప్రతి ఒక్కరు తెలియవలెను. దేవుడు మనుషులు వ్రాసుకొను భాషను ఏమాత్రము పట్టించుకోడు. మనుషులు ఇష్టమును బట్టి వారు వ్రాసుకోవడము, వారికి వచ్చిన భాషనుబట్టి వ్రాయడము, చదవడము జరుగుచుండును. వ్యాసునికి హిందీ భాష, సంస్కృత భాష రెండు భాషలు వచ్చెడివి. హిందీ సర్వసాధారణముగా మాట్లాడు భాషగా యుండెడిది. ఆనాడు ఆధ్యాత్మిక విషయములేవయినా సంస్కృతములోనే వ్రాయాలనీ, సంస్కృతములోనే మాట్లాడాలని ఒక నియమమును ఆనాటి

పెద్దలు అనబడు కొందరు స్వార్థము గలవారు పెట్టారు. సంస్కృతము ఇష్టమున్నా లేకపోయినా దానిలోనే ధార్మిక విషయములన్నియూ వ్రాయడము, మాట్లాడడము జరిగెడిది. సంస్కృతము లిపిలేని భాష అయినందున నేర్వడము కష్టమైన పనిగాయుండేది. సంస్కృతమును నేర్చుటకు సంస్కృతమును మాట్లాడు వారి మధ్యలోనికి పోయి కొన్ని రోజులుండి నేర్చుకోవలసి వచ్చేది. భాషను నేర్చినంత మాత్రమున లిపి లేకపోవడము వలన హిందీ భాష లిపిని ఉపయోగించి సంస్కృత భాషను వ్రాసేవారు. హిందీ భాష లిపితో ఆనాడు వ్యాసుడు సంస్కృతములో భగవద్గీతను వ్రాయడమైనది.

వ్యాసుడు ఆ కాలములో ఎక్కువ గ్రంథములు వ్రాసినవాడు. అయినా వ్యాసునికి సంస్కృత భాష అంటే ఇష్టము లేదు. ఇష్టము లేకున్నా, ఆ భాషలోనే వ్రాయవలెనని నియమము ఉండుట వలన తప్పనిసరిగా సంస్కృత భాషలోనే భగవద్గీతకంటే ముందు వ్రాసిన వేదములను, పురాణములను, ఉపనిషత్తులను వ్రాశాడు. సంస్కృత భాష హిందీ భాషకంటే కష్టమయిన భాషగాయున్నది. సుగాలి, ఎరికల భాషలవలె సంస్కృత భాషకు లిపి లేదు. అయినా హిందీ భాషను ఉపయోగించి సంస్కృత భాషలో గ్రంథములను వ్రాశాడు.

**16) ప్రశ్న :- హిందీ భాష సంస్కృత భాషకంటే సులభమైనప్పుడు హిందీలోనే వ్రాయవచ్చును కదా?**

**జవాబు :-** కొందరు సంస్కృతమును నేర్చినవారు అది కష్టమైన భాషయని తెలిసి, ఉచ్చారణలో అనేక తప్పులు ఉండునని తెలిసి, దానిని ఇతరులు నేర్చుటకు కష్టమైన దానివలన సంస్కృతమునే ధార్మిక భాషయనీ, దేవునికి

దగ్గరగాయున్న భాషయనీ, దేవతలందరూ సంస్కృతములోనే మాట్లాడు చుందురని, దానివలన అదే భాషలోనే ఏమి వ్రాసినా వ్రాయవలెనని నియమమును ఉంచారు. హిందూమతములో జ్ఞానపెద్దలనో, దైవజ్ఞానులనో పేరుగాంచిన వారే మిగతా ప్రజలందరూ తమ మాటను వినుటకు, ప్రజలలో తమ ఆధిపత్యముండుటకు అలా సంస్కృత భాషను అడ్డము పెట్టుకొన్నారు. వాస్తవముగా సంస్కృతము విలువ లేని భాష, దానికి లేని గౌరవమును ఉంచుట వలన తమ పెద్దరికము ప్రజలలో ఉండుననీ, సంస్కృతమును నేర్చిన ఒక గుంపు వారు పన్నిన పన్నాగమే సంస్కృతమును చదువవలెనని చెప్పడము. భాషను అడ్డము పెట్టుకొని తమ పెత్తనమును చెలాయించుచూ, భాషను బట్టి వీరు జ్ఞానులనీ, వీరు అజ్ఞానులని తేల్చి చెప్పుచూ, తాము పెద్దలగు జ్ఞానమును నిర్ణయించువారిలాగ చెలామణి అగుచూ ప్రజల చేత గౌరవింపబడుచుందురు. రాని భాషను, కష్టమైన భాషను ప్రజలపై రుద్ది ఒక పదమును పలికితే అలా పలుకకూడదు ఇలాగే పలుకవలెనని చెప్పి, వారు చెప్పినట్లు పలికినా ఇది తప్పు అని చెప్పుచూ మనిషిని తమ ముందర తక్కువవాడని భావింపజేయుచున్నారు. సంస్కృత భాష వచ్చిన వారికంటే మిగతావారు అన్ని విధముల తక్కువవారను భావము వచ్చునట్లు చేసి ఒక్క కులమునకు తప్ప మిగతా కులముల వారికి సంస్కృతము నేర్చు అవకాశమే ఇవ్వలేదు. ఇతర కులములవారు సంస్కృతమును నేర్వాలనుకొన్నా వారు దానికి అర్హులు కాదని చెప్పెడివారు. సంస్కృత భాషను దొంగగా నేర్వగలిగినా సంస్కృత భాషలో యున్న వేదములను, ఉపనిషత్తులను చదువకూడదని అంక్షలు పెట్టేవారు. దొంగచాటుగా చదివాడని తెలిసినా శూద్రులు వేదములు చదువకూడదను నియమమును చూపి దానికి శిక్షను వేసెడివారు.

రాజులు సహితము వారిమాట వినుట వలన, రాజుల ఆస్థానములో ఆస్థాన పండితులుగా ఒక వర్గమువారే యుండుట వలన, రాజులను వారి మాట వినునట్లు చేసుకొని, వేదములను ఇతర వర్గముల వారు చదివితే రాజులకు చెప్పి, రాజుల ద్వారా వేదములు చదివిన వారికి శిక్షను వేసెడివారు. ఆ శిక్షలకు భయపడి శూద్రులు వేదములను చదవడము మానివేశారు. అలాగే సంస్కృతమును నేర్వను కూడా వదలివేశారు. అలా ఇతరులను సంస్కృత భాష తెలియకుండా చేసి, సంస్కృతము రాని వారికి జ్ఞానము తెలియదనీ, సంస్కృత భాష వచ్చిన మాకు మాత్రమే దైవజ్ఞానము తెలియుననీ, ఇతరులకు తెలియదని చెప్పి, గురువుల స్థానములో శాశ్వితముగా తామే ఉండునట్లు చేసుకొన్నారు. ఈ విధానము పూర్వము నుండి సాగుతూనే వస్తున్నది. భాషను అడ్డము పెట్టుకొని, భాషను తామే నేర్చి ఇతరులకు తెలియకుండా చేసి, చిన్న పెద్ద విషయములకు వారినే ఆశ్రయించులాగ చేసుకొన్నారు. ఈ విధముగా తమకే బ్రహ్మజ్ఞానము తెలియునని, ఇతరులకు సంస్కృతము రాని దానివలన వారికి దైవజ్ఞానమే తెలియదని, జ్ఞాన విషయములలోగానీ, ప్రపంచ విషయములలోగానీ శూద్రులను ముందుకు రాకుండా చేసి శూద్రుల మీద ఆధిపత్యమును కల్గియున్నారు.

**17) ప్రశ్న :- పండితులు అనిపించుకొన్న వారు నేడు గురువులుగాయుండి, సంస్కృతము నేర్చినవారు ఎవరూ లేకపోవడము వలన పండితులదే పై చేయి అయినది. నాగరికత తెలిసిన ఈ రోజులలో కూడా భాషకు ప్రాధాన్యత ఇస్తున్నారు. కావున నేడు సమాజములో సంస్కృత పండితులే గురువులుగా యున్నారు, జ్ఞానులుగా కనిపిస్తున్నారు.**

**జవాబు :–** నిజమేయని మేము కూడా చెప్పుచున్నాము. పండితులయిన వారు తమకు వచ్చిన సంస్కృత భాషను అడ్డము పెట్టుకొని సంస్కృత భాషరాని మిగతా వారందరిని తమకంటే తక్కువ వారిగా చేసి చూపుటకు చేసిన కుట్రపూరిత పథకమని తెలియుచున్నది. సంస్కృత భాషను నేర్వగలిగిన ఒక జాతి పండితులు ఆ భాషను ఇతరులకు సంబంధము లేకుండా చేసి సంస్కృతము నేర్వని వారు జ్ఞానులే కాదన్నారు. అంతేకాక ఆ భాషలో ఒక మంత్రమును తయారు చేసి, దానికి గాయిత్రీ మంత్రమని పేరుపెట్టి జ్ఞాని అయినవాడు గాయిత్రీ మంత్రమును ఉదయము, సాయంకాలము చదువవలెననీ, గాయిత్రీ మంత్రమును పఠించని వాడు జ్ఞాని కాదని ప్రచారము చేశారు. గాయిత్రీ మంత్రమును చదువుటకు బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియులే అర్హులని కూడా అన్నారు. శూద్రులు గాయిత్రీ మంత్రమును చదువకూడదని చెప్పారు. ఒక సందర్భములో శూద్రులు ఎందుకు చదువకూడదని ప్రశ్నించితే, దానికి జవాబుగా వారికి సంస్కృతము రాదు. అందువలన చదువకూడదని చెప్పారు. నోరు తిరుగని భాష సంస్కృతము, దానిని నేర్వాలంటే కష్టము. ఇంకొక విధముగా సంస్కృత పాఠశాలలో శూద్రులకు ప్రవేశము లేదు. అప్పుడు సంస్కృత భాషను నేర్చుటకు వీలుపడదు. అలాంటప్పుడు సంస్కృత భాషను తెలుగు భాషలోనికి అనువదించి చదువుకొంటే దానివలన గాయిత్రీ మంత్రమును నియమము తప్పకుండా పఠించవచ్చును కదా! అని అంటే అలా పండితులయిన వారు ఒప్పుకోవడము లేదు. వీరు సంస్కృతమును తెలుగు భాషలోనికి అనువదించడము లేదు. గాయిత్రీ మంత్రమును సంస్కృత భాషలోనే చదువాలి అంటున్నారు. సంస్కృతములోనే దేవుడు వినగలడు అని కూడా అంటున్నారు. సంస్కృతమునకు దేవునికి ఏమి సంబంధమని ప్రశ్నించితే,

దేవుడు జ్ఞానమును సంస్కృతములోనే చెప్పాడు, గాయిత్రీ మంత్రము మొదట సంస్కృతములోనే తయారయినది, కావున దానిని ఎప్పుడయినా సంస్కృతము లోనే చదువవలసియుండును. మొదట ఏ భాషలో తయారైతే అదే దానికి జన్మ భాష. దానిని వేరే భాషలోనికి మార్చితే గాయిత్రీ మంత్రమును హత్య చేసిన దానితో సమానమగును అని అంటున్నారు. గాయిత్రీ మంత్రమును నిత్యము రెండుమార్లు చదువవలెను. అలా చదివినవాడే జ్ఞాని అని అంటున్నారు. సంస్కృతము రానివారు చదువకూడదని చెప్పేదీ వారే, శూద్రులు సంస్కృతము నేర్వకూడదని చెప్పేదీ వారే, సంస్కృత భాషను వేరే భాషలోనికి మార్చకూడదనేదీ వారే. దీనినిబట్టి లోకములో పండితులుగా యున్నవారు సంస్కృతమును వచ్చిన ఒక కులమువారు మాత్రమే జ్ఞానులుగా ఉండవలెననీ, మిగతావారు ఎవరూ జ్ఞానులు కాకూడదనే కదా! వారి భావము. ఇలా కుచ్ఛితపూరిత ఉద్దేశ్యముతో కొందరు పండితులనువారు ఉండుట వలన మిగతావారు వారి క్రింది వారుగా యుండవలసి వస్తున్నది. వారు తమ ఆధిపత్యమును అందరి మీద చెలాయించుటకు అలా భాషను అడ్డము పెట్టుకున్నారు.

**18) ప్రశ్న :- హిందువులలో కొందరు సంస్కృత భాష వచ్చినవారు తమ ఆధిపత్యమును సాధించుటకు గాయిత్రీ మంత్రమును ఒక ఆయుధముగా ఉపయోగించుకొంటున్నారు. దుష్టపండితులయిన వారికి ఆయుధముగా ఉపయోగపడు గాయిత్రీ మంత్రము ఎలాగుంటుందో ఒకమారు చెప్పండి. ఆ మంత్రము ఎలాగున్నదో మేము కూడా చూస్తాము?**

**జవాబు :-** ముస్లీమ్‌లలో నమాజ్ (దేవుని ప్రార్థన) చేయునప్పుడు ఏడు సంఖ్యగల ఆయత్‌లను (వాక్యములను) పఠించుచుందురు. అలాగే హిందువులు పూర్వమునుండి దేవుని ప్రార్థన చేయునప్పుడు పదకొండు

సంఖ్యగల మంత్రములను (మాటలను) పఠించుచుందురు. ఏడు వాక్యముల నమాజ్‌ను ఐదు పూటలు ముస్లీమ్‌లు చేయుచుందురు. పదకొండు మాటల గాయిత్రీని మూడు పూటలు చేయవలెను. అయితే హిందువులు మధ్యాహ్న వేళ వదలి ఉదయము, సాయంకాలము సంధ్యవేళలో మాత్రము గాయిత్రీ మంత్రమును పఠించుచుందురు. వాస్తవానికి సంధ్యావందనములు రెండేకాక మధ్య వందనము కూడా కలదు. హిందువులలో పండితులు తమ ఇష్టమున్నట్లు ఉదయము, సాయంకాలము రెండు పూటలకే పరిమితి అయినారు. సంధ్యవేళలలో మాత్రము చేస్తే సరిపోతుంది అని అంటున్నారు. చివరకు దానిపేరే సంధ్యావందనము అని మార్చివేశారు. ముస్లీమ్‌లలో ఐదుపూటల నమాజ్‌ను అందరూ చేయడము లేదు. కొందరు కొన్ని నమాజ్‌లే చేస్తూ రెండు మూడు నమాజ్‌లకే పరిమితియైనారు. అయినా కొన్ని దినములలోనయినా ఐదు పూటల నమాజ్‌ను చేయుదురు. హిందువులు అట్లుకాకుండా మధ్యాహ్న ప్రార్థనను మొత్తానికి వదలివేసి, రెండు సంధ్యాకాలములలో చేయు ప్రార్థనకే పరిమితియైనారు. పూర్వము మధ్యాహ్నవేళ కూడా సంధ్యావందనము కలదని హిందువులు పూర్వము చెప్పెడివారు.

పూర్వమునుండి హిందువుల ఆరాధన గాయిత్రీ మంత్రమని ప్రచారము చేశారు. గాయిత్రీ మంత్రము పదకొండు మాటల సమ్మేళనమని చెప్పవచ్చును. అది ఇలా ఉన్నది. "ఓం భూః, ఓం భువః, ఓం సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓం సత్యం, ఓం తత్సవితుర్వరేణ్యం, భర్గోదేవస్య ధీమహి, ధియో యోనః ప్రచోధయాత్, ఓం ఆసో జ్యోతీ రసోమృతం బ్రహ్మ భూర్భువ స్వరోం" ఈ విధముగా యున్న సమ్మేళన గాయిత్రీ మంత్రమును పండితులు, ప్రజల దృష్ఠిలో జ్ఞానులు అనిపించుకున్న

వారు, మూడు పూటల ఆరాధనగా చేసెడివారు. కాలక్రమములో అది కాస్త రెండు పూటల ఆరాధనగా మారిపోయినది. ఈ మధ్యకాలములో వంద సంవత్సరముల నుండి ఉద్యోగము చేసి బ్రతుకువారుండుట వలన వారి ఉద్యోగముల అనుకూలతనుబట్టి రెండుపూటలు కూడా చేయకుండా ఒక పూటకే సంధ్యావందనమును తగ్గించుకొన్నారు. కొందరు ఒకపూట కూడా చేయకుండా మానుకొన్నారు. హిందువులలో జ్ఞానరీత్యా బ్రహ్మ విద్యా శాస్త్రరీత్యా లెక్కించి చూచిన గాయిత్రీ మంత్రమును జపించుట ధర్మమే కాదు. ధర్మముకాని దానిని కూడా సరిగా ఆచరించక మూడు నుండి ఒక ఆరాధనకు, ఒకటినుండి పూర్తి లేకుండా చేసుకొన్నారు. అదే ముస్లీమ్‌లు కొందరయినా ఐదు పూటల నమాజ్ చేయడము హిందువులకంటే చాలా మేలు అనిపిస్తున్నది.

**19) ప్రశ్న :- హిందువులు కృతయుగమునుండి యున్నారు. ముస్లీమ్‌లు కలియుగములో 3600 సంవత్సరములు గడచిన తర్వాత వచ్చారు. హిందువులు పూర్వమే గాయిత్రీ మంత్రమును తయారు చేసుకొన్నట్లు ముస్లీమ్‌లు కూడా దేవుని ఆరాధన విషయమై ఏడు వాక్యముల నమాజ్‌ను తయారు చేసుకొన్నారు అని తెలిసినది. హిందువుల ధర్మములో దేవుడిచ్చిన గ్రంథములో బ్రహ్మ విద్యాశాస్త్రము ప్రకారము గాయిత్రీ మంత్రము లేదు. అయితే మనుషులే దానిని తయారు చేసుకొన్నారని తెలిసినది. ముస్లీమ్‌లలో ప్రార్థన వారి గ్రంథమందు దేవుడు చెప్పాడా! లేక ముస్లీమ్‌లే తయారు చేసుకొన్నారా?**

**జవాబు :-** 'నమాజ్' అనుమాట అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో ఉండుట వాస్తవమే. నమాజ్ అనగా దేవుని ఆరాధన. దేవుని ఆరాధన

ప్రత్యేకమయినది. అది మాటలతో కూడుకొని ఉండదు. నేడు నమాజ్ అని దేవుని ప్రార్థనను అంటున్నాము. దేవుని దృష్టిలో ఇంతవరకు మనుషులు నమాజ్ చేయలేదను భావముతో ఇప్పుడు ఎవరయితే నమాజును నెలకొల్పుతారోయని చెప్పారు. నమాజు అనే ప్రార్థనను ముస్లీమ్ సమాజము మొత్తము ప్రతి దినము చేయుచున్నది. ప్రపంచములో అన్ని మతముల కంటే ఎక్కువ ప్రార్థనలో కాలము గడిపేవారు, ఎక్కువగా ప్రార్థన చేసేవారు ముస్లీమ్ మతములో యున్నారు. అలా ఉండగా మీరు (మనుషులు) నమాజ్ (ప్రార్థన) చేయలేదని చెప్పుచున్నారేమిటి? యని అడుగవచ్చును. దానికి నా జవాబు ఈ విధముగా గలదు. ముస్లీమ్‌లు మిగతా రెండు మతములకంటే ప్రార్థన విషయములో ముందుగలరు. వారి జీవితములో ప్రార్థనకే ఎక్కువ ప్రాధాన్యతను ఇచ్చుచున్నారు. అయితే వారు చేయునది వాస్తవముగా ప్రార్థన కాదు. ఈ విషయమును 'తౌహీదే ఉలూ హియత్' అను ఆరాధన క్రమములో ముస్లీమ్ పండితులే చెప్పారు. ఏ మాటగానీ, ఏ మంత్రముగానీ ప్రార్థనలో యుండకూడదు. ఒకమాటను ఉచ్ఛరించుచూ చేయు ప్రార్థన తపస్సు క్రిందికి వస్తుంది. తపస్సువేరు, ప్రార్థన వేరు, ప్రార్థనను **యోగము** అని బ్రహ్మవిద్యా భాషలో చెప్పగలము. ప్రార్థన ఏదో తెలియక తపస్సును ఆచరించుచూ తాము యోగము (ప్రార్థన) చేశామని అనుకొంటున్నారు. మనుషులు అందరూ పొరపడిపోయి ఒక మంత్రమును జపించు హిందువు తాను చేయునది ప్రార్థన అని అనుకుంటున్నాడు. అట్లే నోరు మెదుపుచూ మాటలతో గట్టిగా అడిగినట్లు మాట్లాడుచూ క్రైస్థవులు ప్రార్థన చేయుచున్నారు. హిందువులకు మంత్రములు, క్రైస్థవులకు మాటలుండడము వలన అది ప్రార్థన కాలేదు. అలా చేయునది ప్రార్థనయని మనము అనుకొనినా అది ప్రార్థన కాదు తపస్సగును.

రెండు మతములుగా యున్న హిందువులలో, క్రైస్థవులలో ప్రార్థన (యోగము) లేదు ఉన్నదంతా తపస్సేయని అర్థమయినది. దేవుని ప్రార్థన విషయములో మొదటి వరుసలో యున్నారను ముస్లీమ్‌లు కూడా మనస్సులో ఏడు ఆయత్‌లను స్మరించుచుండుట వలన అది కూడా తపస్సు క్రిందికే వచ్చినది. తపస్సులకంటే యోగమే శ్రేష్ఠమయినది అని ప్రథమ దైవగ్రంథము భగవద్గీతయందు ఆత్మ సంయమ యోగములో 46వ శ్లోకమున చెప్పి యున్నారు చూడండి.

శ్లో॥ 46. తపస్విభ్యోధికో యోగీ జ్ఞానిభ్యోపి మతోధికః ।
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥

**భావము :- "యోగి తపస్వికుల కంటే ఉత్తముడు, అధికుడు. కర్మముల చేయువారికంటే గొప్పవాడు. జ్ఞానులకంటే ఘనుడు. అయినందున అర్జునా నీవు యోగివేకమ్ము"** అని భగవంతుడు అర్జునునకు చెప్పాడు. ఈ విధముగా యోగము తపస్సులకంటే శ్రేష్ఠమయినందున, యోగము వలననే దేవుడు తెలియుట వలన, తపస్సుల వలన దేవుడు తెలియబడదు కావున, తెలియక చేసెడి తపస్సులను వదలి యోగమే ఆచరించుట మేలు. ఇదే విషయమునే అంతిమ దైవగ్రంథమందు ప్రథమ వాక్యములలో (2-3) వాక్యమందు **'నమాజును నెలకొల్పువాడు'** అని చెప్పియున్నాడు. అలా చెప్పియుండుట వలన నేడు నమాజ్ అనునది సరియైన పద్ధతిలో లేదనీ, అది పడిపోయిన నమాజ్‌గాయున్నదనీ, దానిని తిరిగి ప్రతిష్ఠించవలెననీ, దానినే నెలకొల్పమని చెప్పడమని అర్థము చేసుకోవలెను. ఖురాన్‌లో చెప్పబడిన వాక్యమునుబట్టి మనము నేటినుండి నమాజ్‌ను తిరిగి నెలకొల్పుటకు ప్రయత్నిద్దాము. నమాజ్ అంటే అర్థమును మొదట తెలియగలిగితే, తర్వాత నమాజ్‌ను ఎలా నెలకొల్పాలను నిర్ణయానికి రావచ్చును. 'నమాజ్' అను పదములో

మూడు శబ్దములు కలిసిన పదముగా యున్నది. నమాజ్‌ను విడదీసి చూస్తే న, మ, జ్ అను మూడు అక్షరములు కనిపించుచున్నవి. అందులోగల ఒక్కొక్క అక్షరమునకు ఒక్కొక్క అర్థముగలదు. **'న'** అనగా వద్దు అనీ, **'మ'** అనగా నాకు అనీ, **'జ్'** అనగా జన్మలనీ అర్థము. అన్నీ కలిపి చూస్తే **'నాకు జన్మలు వద్దని'** అర్థము గలదు.

'నాకు జన్మలు వద్దు' అను భావముతో ఎవరూ ప్రార్థన చేయడము లేదు. జన్మలు వద్దు అంటే పరోక్షముగా ఈ లోకము వద్దు పరలోకమయిన మోక్షము కావలెనని అర్థము. ఒక్క హిందూమతములో తప్ప మిగతా మతములలో 'జన్మలు లేవు' అను అపోహలోనే యున్నారు. ముందే ఆ విధముగా యుండడము వలన ఎవరూ ప్రార్థనలో 'జన్మలు వద్దు' అనే ఉద్దేశ్యము కల్గియుండలేదు. నమాజ్ విషయము సంపూర్ణముగా తెలియ వలెనంటే మా రచనలలోని **"గీటురాయి"** గ్రంథమును చదవండి. అప్పుడు 'నమాజ్‌ను నెలకొల్పండి' అను మాటకు పూర్తిగా వివరము తెలియును. నమాజ్‌లో (ప్రార్థనలో) దేవుని భావము వేరుగాయుండగా, మనుషులు ఇంకొక విధానములో ప్రార్థన చేయుచూ, అదే నిజమైన ప్రార్థన అనుకోవడము మంచిది కాదు. మనుషులు చేయు ప్రార్థన అన్ని మతములలోనూ సరిగా లేనందున, ఖురాన్ గ్రంథములో మూడు ప్రథమ వాక్యములలో దేవుడు నమాజ్‌ను గురించి చెప్పుచూ, ఎవడు నమాజ్‌ను స్థాపిస్తాడో వాడు తన మార్గములో ఉన్నవానిగా గుర్తింపబడునని తెలియజేశాడు. అంతేకాక రెండవ వాక్యములో మరియొక మాట కూడా చెప్పాడు.

నమాజ్‌ను గురించి ఇంకా లోతుగా ఆలోచిస్తే ఈ విధముగా తెలియగలదు. కొన్ని శబ్దములు కలిస్తే మాటయగును. ఒకే శబ్దము

మాటకాదు, అందులో అర్థము ఉండదు. ఒక శబ్దమును ఒక గుర్తుగా చెప్పవచ్చునుగానీ, అర్థముతో కూడుకొన్న మాటగా చెప్పలేము. ఆయత్ అనగా ఒక శబ్దము కావచ్చును, లేక ఒక మాట కావచ్చును. అల్లాహ్ (దేవుడు) ప్రతి మనిషి శరీరములో ఏడు నాడీకేంద్రములను ఇచ్చాడు. జంతువుల శరీరములలోనూ ఏడు నాడీకేంద్రములు గలవు. మనిషి శరీరములోని ప్రతి నాడీకేంద్రము నుండి ఒక శబ్దము బయలుదేరుచున్నది. ఒక నాడీ కేంద్రము తర్వాత మరొక కేంద్రము నుండి శబ్దము బయలు దేరును. ఇట్లు ఒక కేంద్రము తర్వాత మరొక కేంద్రముగా, ఏడు నాడీకేంద్రములనుండి శబ్దములు బయలుదేరును. ఏడు నాడీకేంద్రముల లోనూ బయలుదేరు శబ్దములు ఒక్కటే అయినా ఒకదాని తర్వాత మరొకటి బయలుదేరుచున్నవి. ఇది శరీరములో ఎడతెరపి లేకుండా జరుగుచున్నది. నాడీకేంద్రముల నుండి బయలు దేరుచున్న శబ్దములు ముక్కు ద్వారా బయటపడుచున్నవి. ఇంకా వివరముగా తెలియగలిగితే నాడీకేంద్రము నుండి ఒక చైతన్యము బయలుదేరి ఊపిరితిత్తులను చేరి ఊపిరితిత్తులను మూడుచుకొనునట్లు తెరచుకొనునట్లు చేయుచున్నది. అప్పుడు ఊపిరితిత్తులలోని గాలి బయలుదేరి ముక్కుల ద్వారా బయటికి పోవుచున్నది. గాలి బయటికి పోవునప్పుడు చిన్న శబ్దము ఏర్పడుచున్నది. అట్లే గాలి ముక్కుల ద్వారా లోపలికి వచ్చునప్పుడు కూడా శబ్దము ఏర్పడుచున్నది. దీనినే 'శ్వాస' అంటున్నాము. వినికిడి శబ్దములగుట వలన వీటికి అర్థము లేదు. ఈ శబ్దములు శక్తికి (చైతన్యమునకు) గుర్తుగా యున్నవి.

నాడీకేంద్రములలో క్రిందినుండి మొదటి నాడీకేంద్రము తన చైతన్యము ద్వారా 600 శ్వాసలను నడుపుచున్నది. దాని తర్వాత గల రెండవ నాడీకేంద్రము వెంటనే ఊపిరితిత్తులను కదలించుచూ 6000

శ్వాసలు ఆడువరకు ఊపిరితిత్తులకు చైతన్యమును కలుగజేయుచున్నది. ఇట్లు రెండవ నాడీకేంద్రము 6000 శ్వాసలు ఆడువరకు చైతన్యమును ఇచ్చిన తర్వాత వెంటనే మూడవ నాడీకేంద్రము అదే పనినే చేయుచున్నది. మూడవ కేంద్రము కూడా 6000 శ్వాసలను నడుపుచున్నది. దాని తర్వాత నాల్గవ కేంద్రము కూడా 6000 శ్వాసలు నడుపుచున్నది. దాని తర్వాత ఐదవ నాడీకేంద్రము 1000 శ్వాసలను మాత్రమే నడుపుచున్నది. అది అది అయిపోయిన వెంటనే ఆరవ కేంద్రము తన చైతన్యము చేత 1000 శ్వాసలను నడుపుచున్నది. చివరిగా ఏడవ నాడీకేంద్రము కూడా క్రింది నాడీకేంద్రము పని అయిపోయిన వెంటనే తన పనిని ప్రారంభించి 1000 శ్వాసలు నడుపుచున్నది. ఇప్పటికి ఏడు నాడీకేంద్రముల పని ఒకమారు అయిపోయినది. దానివలన శ్వాసలు ఏడు కేంద్రములకు మొత్తము 21,600 శ్వాసలు జరిగినవి. ఈ విధముగా పైనగల ఏడవ నాడీకేంద్రము పని అయిపోయిన వెంటనే తిరిగి క్రింది మొదటి నాడీకేంద్రము శ్వాసలు లాగను మొదలుపెట్టును. ఇట్లు ఒకదాని తర్వాత మరొకటి ఎడతెరపి లేకుండా పునరావృత్తమగుచూ శ్వాసలను మనిషి చనిపోవు వరకు నడుపుచున్నవి. ఇదే విషయమునే అంతిమ దైవగ్రంథము ఖురాన్‌యందు 15వ సూరా 87వ ఆయత్‌లో ఈ విధముగా చెప్పియున్నారు చూడండి.

**(15-87) "మేము నీకు ఏడు ఆయత్‌లను ఇచ్చియున్నాము. అవి పదే పదే పునరావృత్తమవుతుంటాయి. ఇంకా మహోన్నతమైన ఖురాన్‌ను నీకు ప్రసాదించాము."**

ఈ వాక్యములో చెప్పిన విధానము ప్రకారము "పదేపదే పునరావృత్తమయ్యే ఆయత్‌లు ఉన్నాయి" అన్నాడు. ఒకవేళ పొరపాటుగా

ఏడు ఆయత్‌లు ఖురాన్ గ్రంథములో చెప్పిన వాక్యములుగా పోల్చు కుంటారేమోయని వాక్యము చివరిలో "ఇంకా మీకు మహోన్నతమైన ఖురాన్‌ను ఇచ్చాము" అని చెప్పడమైనది. దీనిప్రకారము ఖురాన్ వేరు, ఏడు ఆయత్‌లు వేరని తెలియుచున్నది. ఏడు ఆయత్‌లను ఖురాన్ గ్రంథములోనికి కలుపకుండా అవికాక ఇంకా ఖురాన్ గ్రంథమును ఇచ్చానని చెప్పారు. శరీర అంతరంగములో ఆత్మ చైతన్య శక్తిని ఏడు నాడీకేంద్రములలో అమర్చి ఇచ్చిన దేవుడు అవికాక ప్రత్యేకముగా బాహ్య రంగములో ఖురాన్ గ్రంథమును ఇవ్వడము జరిగినది. అందువలన పొరపాటుగా కూడా ఈ ఏడు ఆయత్‌లను ఖురాన్‌లో కలుపకూడదు. శరీరములో నాడీకేంద్ర రూపములో ఇచ్చిన ఏడు శబ్దముల చైతన్యములు ఒక దాని తర్వాత మరొకటి మనిషి పుట్టినప్పటినుండి చనిపోవు వరకు తిరిగి తిరిగి వచ్చుచుండును. నాడీకేంద్రములు ఏడే యుండుట వలన ఏడు ఆయత్‌లని చెప్పడమైనది. శరీర అంతర్గత ఆయత్‌ను చెప్పగా మనిషి బయట గ్రంథములోని మాటలని అనుకోవడము జరుగుచున్నది. ఈ విధముగా మనిషి అజ్ఞానముతో లోపల చెప్పినవి బయటికి అర్థము చేసుకోవడము వలన దైవజ్ఞానము తెలియకుండా పోయినది.

ఖురాన్ గ్రంథములో స్థూలమైన వాక్యములు కొన్ని, సూక్ష్మమైన వాక్యములు ఎన్నో గలవు. ఖురాన్ గ్రంథములో (15-87) ఆయత్‌లో చెప్పిన రెండు వాక్యములలో ఒకటి సూక్ష్మ అర్థముగలది, రెండవది స్థూల అర్థముతో కూడుకొన్నదై యున్నది. మొదటి వాక్యములో "ఏడు ఆయత్‌లు ఇచ్చియున్నాము" అని కలదు. మనిషికి ఏడు ఆయత్‌లు ఇచ్చియుండడము వాస్తవమే అయినా అవి శరీరము లోపల ఇచ్చినవని, బయటివి కాదని ఎవరూ అనుకోవడము లేదు. "ఏడు ఆయత్‌లు పదే పదే పునరావృత్తమవు

తుంటాయి" అని చెప్పియున్నారు. దానిని చదివిన వారు సరియైన భావముతో అర్థము చేసుకోకుండా ఆ ఏడు ఆయత్‌లను మాటిమాటికి, లేక తిరిగి, తిరిగి చదువవలెనని అనుకొంటున్నారు. అలా చదువవలసిన ఏడు ఆయత్‌లు ఏవి అని అడిగితే అవే అల్‌ఫాతిహా అను మొదటి సూరాలోని ఏడు వాక్యములని చెప్పుచున్నారు. **"మీకు ఏడు ఆయత్‌లను ఇచ్చియున్నాను. ఇంకనూ ఖురాన్ గ్రంథమును ఇచ్చియున్నాను"** అన్నప్పుడు 'ఏడు ఆయత్‌లు వేరు, ఖురాన్ గ్రంథము వేరు' అని అర్థమగుచున్నది. అయితే ఖురాన్ గ్రంథములోనివే ఏడు ఆయత్‌లని చెప్పుకోవడము పెద్ద పొరపాటు. 'ఏడు ఆయత్‌లు వేరు, ఖురాన్ గ్రంథము వేరు' అనుటకు సాక్ష్యముగా ఏడు ఆయత్‌లు పదే పదే పునరావృత్తమగుచున్నవని చెప్పుట వలన దాని అర్థము ప్రకారము ఏడు ఆయత్‌లు మనుషుల ప్రమేయము లేకుండా మాటి మాటికి తిరిగి పుట్టుచున్నవి. మనుషులు మాటల రూపములో వ్రాసుకొన్న ఏడు ఆయత్‌లు మనిషి చదివితే తప్ప అవి బయటికి తెలియవు. మనిషి మాటిమాటికి చదివితే తప్ప అవి పునరావృత్తము కావు. అందువలన మనుషులు వ్రాసుకొన్న మాటలు తప్ప మనుషులు చదవని, వ్రాయని ఏడు ఆయత్‌లను దేవుడు ముందుగా మనుషులు పుట్టినప్పుడే వారి శరీరములలో ఉండునట్లు ఇచ్చాడు. తర్వాత కాలములో ఖురాన్ గ్రంథమును బాహ్యముగా ఇచ్చి ఖురాన్‌లోని జ్ఞానము వలన మనిషి వ్రాయని, చదవని మాటిమాటికి వాటంతటవే పునరావృత్తమగు ఏడు శబ్దములను (ఆయత్‌లను) తెలియమన్నాడు. ఏడు ఆయత్‌లకు సంబంధించిన విషయమును భాషలో చెప్పియున్నా అది భావములో మనుషులకు చేరలేదు. అందువలన అక్కడ (15-87) వాక్యములో తెలియ వలసిన జ్ఞానమును తెలియలేకపోయారు. దీనినిబట్టి భాషకంటే భావము ముఖ్యమని తెలియుచున్నది.

**'నమాజ్'** అనగా **నాకు జన్మ లేకుండా పోయి మోక్షమును అనగా పరలోకమును పొందవలెనని అర్థము.** దేవునియందు ఐక్యమైయుండి, తిరిగి పుట్టకపోవడమును కోరి చేయునది నమాజ్ అని తెలియుచున్నది. నమాజ్ కొరకు సూక్ష్మముగాయున్న ఏడు ఆయత్‌ల మీద ధ్యాసను పెట్ట వలెనని చెప్పవలెను. శరీరములోని ఏడు ఆయత్‌ల శబ్దములు పుట్టుటకు కారణమయిన ఏడు నాడీకేంద్రములలో శక్తిగా, లేక చైతన్యముగాయున్న **ఆత్మ** మీద ధ్యాసను పెట్టడము నిజమైన నమాజ్‌యగును. మనుషులు ఎవరూ ఆత్మమీద ధ్యాసను ఉంచడము లేదు. బోధకులు సహితము ఆత్మను గురించి బోధించడము లేదు. సూక్ష్మమైన ఆత్మ విధానము (ఆత్మ జ్ఞానము) మనుషులకు తెలియదు. ఇదే విషయమునే అంతిమ దైవగ్రంథ మందు సూరా 17, ఆయత్ 85లో ఇలా కలదు చూడండి.

**(17-85) వారు ఆత్మను గురించి నిన్ను ప్రశ్నిస్తున్నారు. "ఆత్మ నా ప్రభువు ఆజ్ఞతో ముడిపడి ఉంది. మీకు ఇవ్వబడిన జ్ఞానము బహు స్వల్పము" అని వారికి చెప్పు.**

(దీనిని గురించి "అంతిమ దైవగ్రంథము ఖుర్‌ఆన్" లో ఈ విధముగా వివరమును వ్రాసియున్నారు చూడండి.)

"ఆత్మ ఎంతో సూక్ష్మమైనది, కంటికి కానరానిది, కానీ ప్రతి ప్రాణికి అదే జీవనాధారము. అదెలా ఉంటుంది? దాని వాస్తవికత ఏమిటి? అను విషయము ఎవరికీ తెలియదు. దీనిని గురించి యూదులు కూడా ఒకసారి ముహమ్మద్ ప్రవక్తను ప్రశ్నించారు. అప్పుడు ఈ ఆయత్ అవతరించింది. ఈ ఆయత్ భావమేమిటంటే, మీకున్న జ్ఞానమును దైవజ్ఞానముతో పోల్చినట్లయితే చాలా స్వల్పము. మీరేమో ఆత్మను

**గురించి ప్రశ్నిస్తున్నారు. ఆత్మను గురించిన పరిజ్ఞానమును దేవుడు తన సందేశహరులకే తెలుపలేదు. అయితే ఇది నా ప్రభువు ఆజ్ఞకు లోబడిన అంశము అని మాత్రము తెలుసుకోండి. ఆత్మ వాస్తవికత ఏమిటో నా ప్రభువుకు (దేవునికి) మాత్రము తెలుసు అని తన ప్రవక్త ద్వారా దేవుడు తెలియజేశాడు."** అని ముస్లీమ్ పెద్దలు కొందరు వారి అభిప్రాయమును తెలిపియున్నారు. దీనినంతటినీ గమనిస్తే ఆత్మ విషయము బోధకులకు కూడా తెలియదనియే చెప్పవచ్చును. ఆత్మ విషయము దేవునికి తప్ప ఎవరికీ తెలియని దానివలన ఆత్మను గురించి ఎవరూ చెప్పలేకున్నారు. ఆత్మను గురించి చెప్పు బోధకులే ఇంతవరకు ఎవరూ రాలేదు. వస్తే ఆత్మే రావాలి, చెప్పితే ఆత్మే చెప్పాలి. అంతతప్ప అది సాధ్యమయ్యేపని కాదు. ఆత్మ దేవుని ఆజ్ఞకు లోబడి పని చేయుచుండును. ఆత్మ విషయమును దేవుడు ఆత్మ చేతనే చెప్పించును. దేవుడు ఏమీ చెప్పువాడు కాదు. దేవుడు ఎవరితోనూ మాట్లాడడు, ఆయన ఏ పని చేయడు.

**20)** ప్రశ్న :- **నమాజ్ అనగా ప్రార్థన అనియూ ఏడు నాడీకేంద్రములలో శక్తిగాయున్న ఆత్మను తెలిసి ఆత్మను ధ్యానించుటే ప్రార్థన అనీ, అది శరీర అంతర్గత ఆయత్‌ల ద్వారానే సాధ్యమనియూ చెప్పారు. ఇది సర్వమానవులకు వర్తించు విధానమైనప్పుడు ముందు కాలములోనే కృతయుగమునుండి ఆత్మను ఆరాధించక, ఆత్మను ఆరాధించడమే నిజమైన ఆరాధనయని తెలియక ఆత్మ ఆరాధన శరీరములోనే యున్నదని చెప్పక బయట పదకొండు భాగములుగాయున్న 'గాయిత్రి మంత్రము'ను ఎందుకు ధ్యానించవలెనని అంటున్నారు? లోపలి ఆత్మ ధ్యాసను వదలి బయటి మంత్రము ధ్యాసను ఎందుకు చేయాలి? ముస్లీమ్‌లు శరీరములోని ఏడు శబ్దములను ఆడించు శక్తిని అనుసరించనట్లు, హిందువులు కూడా లోపలి విధానమును వదలి బయటి మంత్రమును ఎందుకు ఆచరించుచున్నారు?**

**జవాబు :-** మనుషులు మాయలో పడుట సహజమే! దేవుడు మొదటనే జ్ఞానమును చెప్పియున్నా ఆయన మాటల భావమును గ్రహించుకోలేని వారు దేవుడు చెప్పిన దానికంటే భిన్నముగా ప్రవర్తించుచుందురు. ఖురాన్ గ్రంథములో "ఇది అంతిమ దైవగ్రంథము" అని చెప్పియుంటే అదే గ్రంథములో (42-51) వాక్యములో చెప్పిన ప్రకారము బోధించిన మూడు విధానములలో ఇది ఆఖరి విధానమనీ, గతములో రెండు విధములు చెప్పియున్నాడనీ, చివరిగా మిగిలియున్న విధానము ప్రకారము బోధించడము వలన దీనికి ఆ పేరు వచ్చినదని చెప్పక, "గతములో చెప్పిన జ్ఞానముకంటే ఇది గొప్ప జ్ఞానము. అప్పటి కాలమునకు తగిన విధానముగా చెప్పినది, ముందు వచ్చిన జ్ఞానము. ఒకటి ద్వాపర యుగములో చెప్పినది అది పాత జ్ఞానము. అప్పటి ధర్మము వేరు, ఇప్పటి ధర్మము వేరు అందువలన భగవద్గీతకంటే ఖురాన్ గొప్పదని, అప్పటి ధర్మముకంటే ఇప్పుడు క్రొత్త ధర్మము మనుషులకు అవసరము. అందువలన ముందు చెప్పిన భగవద్గీత, బైబిలును వదలి ఖురాన్ గ్రంథమునే ఆశ్రయించండి. ఇస్లామ్ మతమును స్వీకరించండి" అని చెప్పుచున్నారు. అదే ఖురాన్ గ్రంథములో "ముందు వచ్చిన గ్రంథములను గౌరవిస్తున్నాను. అందులో **జ్ఞానజ్యోతి, మార్గదర్శకమున్నదని** ధృవీకరిస్తున్నాను" అని ఉండగా ఖురాన్‌లో చెప్పిన దేవుని మాటకు వ్యతిరేఖముగా మతఛాందస్సులు "మా గ్రంథమే గొప్ప, మా ధర్మమే గొప్ప"యని అంటున్నారు. **సృష్ట్యాదినుండి ఎన్ని యుగములు మారినా దేవుడు ఒక్కడే, దేవుని ధర్మము ఒక్కటే.** దేవుడు, దేవుని ధర్మము ఎప్పటికీ మారునది కాదు. అయినా ఎక్కడా లేనిదానిని, ఎక్కడా వ్రాయని దానిని చెప్పుచూ మా మతమే గొప్ప, మా గ్రంథమే గొప్పయనుట దేవునికి వ్యతిరేఖముగా మాట్లాడడము తప్ప వేరుకాదు. అందువలన దేవుని నుండి, దేవదూతల నుండి శిక్ష తప్పదు.

ఈ విధముగా మనిషి మాయ ప్రభావము వలన  అజ్ఞానములో మునిగిపోయి గ్రంథములో వ్రాసిన దానికి వ్యతిరేఖముగా మాట్లాడుచూ 'అంతిమ గ్రంథము' అని చెప్పిన  భావమును గ్రహించుకోలేక పోయారు. కొందరు అంతిమ గ్రంథము యొక్క అర్థమును తెలిసినా  తమ మతము కొరకు దానిని వక్రమార్గములో చెప్పుచూ  తమ గ్రంథమే గొప్ప, తమ జ్ఞానమే గొప్పయని అంటున్నారు.  ఈ విధముగా మనుషులు మతము వైపు పోయి  దేవుని మాటను కూడా గౌరవించడము లేదు.  అదే విధముగా దేవుడు శరీరములో అంతర్గతముగాయున్న జ్ఞానమును చెప్పి, శరీర అంతర్గతములోని శక్తిమీదనే ధ్యాసను పెట్టుకోమని చెప్పగా,  ఆ మాటను లెక్క చేయకనో, చెప్పిన భావమును సరిగా గ్రహించకనో  శరీర లోపలి ధ్యాసను కాకుండా  బయటి ధ్యాసను పెంచుకొంటున్నారు.  బయట మంత్రములను జపించుచున్నారు.  "ప్రతి మాట మంత్రమే, ప్రతి ఆకు ఔషధమే" యన్నట్లు  పదకొండు మాటలతో కూడిన 'గాయిత్రీ మంత్రము'ను హిందువులు, బయట ఏడు మాటలతో కూడిన 'నమాజ్'ను ముస్లీమ్‌లు ఆచరించుచున్నారు.  పదే పదే వాటంతటకవి పునరావృత్తముగా వచ్చు ఏడు ఆయత్‌లు శరీరము లోపలయుండగా, వాటినే ప్రత్యేకించి (15-87) వాక్యములో చెప్పియుండగా  దానిని ఏమాత్రము మనిషి గుర్తించడము లేదు.  ఖురాన్ గ్రంథమును చదివినా  ప్రక్కదారిలో పోవు వారిని దేవుడు క్షమించడు.

ఏ విధముగా ముస్లీమ్‌లు అంతర్గతముగా చెప్పియున్న ఏడు ఆయత్‌లను వదలి  బయట మాటల రూపములోగల ఏడు ఆయత్‌లను చదివి అదే నమాజ్ అంటున్నారో, అదే విధముగా హిందువులు శరీరములో చెప్పిన గాయిత్రీని బయట మంత్రముగా తయారు చేసుకొని  ఉచ్ఛరించుచూ

(చదువుచూ) అదే ప్రార్థన అంటున్నారు. అదే వందనము అనీ, సంధ్యా వందనమని చెప్పుచున్నారు. పూర్వము కృతయుగములో కొందరు జ్ఞానులు సరియైన అంతర్గత ప్రార్థనగా చేయునదే నిజమైన 'గాయిత్రీ'గా యుండేది. గాయిత్రీ అనగా మూడు విధములుగా గలది యని అర్థము. 'గాయి' అనగా 'ఆవు' అని అర్థము. గోవు అనినా ఆవు అని అర్థము. గోవు అను రెండు అక్షరములలో 'గో' నుండి 'గా', 'వు' నుండి 'యి' అని పుట్టిన అక్షరములే గాయి. గోవు, గాయి అని ఎట్లనినా 'ఆవు' అని అర్థము. ఆవును "తల, తోక, నడుము" అని మూడు భాగములుగా చూపినట్లు ఆవును 'గాయిత్రీ' అన్నారు. 'గాయి' అనగా ఆవు కాగా, 'త్రీ' అనగా మూడు అని అర్థము. ఈ పదములన్నీ వాస్తవముగా తెలుగు పదములేయని మరువ కూడదు. ఆవును హిందువులు పవిత్రమైనదిగా చెప్పుకొనుచుందురు. అందువలన క్రొత్త ఇంటిలో మొదట ఆవును ప్రవేశింపజేసి పూజ చేస్తే ఇంటిలో దోషములన్నీ పోయి పవిత్రత చేకూరునని ప్రజల నమ్మకము. అందువలన 'గాయిత్రీ' అనగా 'పవిత్రమైన మూడు' అని అర్థము, లేక మూడు పవిత్రమైనవని కూడా చెప్పవచ్చును.

ప్రక్క పేజీలోని బొమ్మలో చూపిన విధముగా శరీరములో గల ఏడు నాడీకేంద్రములను మూడు భాగములు చేసి క్రింది ఒక భాగమును ప్రత్యేకముగా చేసి, దాని పై భాగము మూడు కేంద్రములను ఒక భాగముగా, ఆ పై భాగములోని మూడు కేంద్రములను ఒక భాగముగా గుర్తించగా ఏడు నాడీకేంద్రములు మూడు భాగములుగా చెప్పవచ్చును. అందులో మొదటి దానిలో 600 శ్వాసలు గలవు. మిగతా మూడులో ఒక్కొక్క దానియందు 6000 ప్రకారము మూడింటియందు 18,000 అగును. తర్వాత మూడు కేంద్రములలో ఒక్కొక్క దానియందు 1000 ప్రకారము

శ్వాసలుండుట వలన మొత్తము 3000 అగుచున్నవి. మూడు భాగములను కలిపిచూడగా మొత్తము 21,600 అగుచున్నవి.

ఏడు నాడీకేంద్రముల చైతన్యము 21,600 శ్వాసలుగా బయట పడుచున్నది. ఒక్కో శ్వాసయందు ఒక శబ్దము గలదు. ఆ శబ్దము ఆత్మశక్తి వలన ఏర్పడినది. ఆత్మ అక్షరమైనది. అక్షరమైన ఆత్మ వలన ఏర్పడిన ఒక శబ్దమును **'ఓం'** అని చెప్పవచ్చును. నాడీ కేంద్రములోని ఆత్మ శక్తి వలన మనిషికి శ్వాస ఆడుచున్నది. శ్వాస బయటికి పోవునప్పుడు **'హమ్'** అను శబ్దముతో పోవుచున్నది. బయటినుండి లోపలికి వచ్చునప్పుడు **"సో"** శబ్దముతో వచ్చుచున్నది. ఒకమారు శ్వాస లోపలికి పోయి, బయటికి వస్తే ఒక శ్వాస ఆడినట్లు లెక్కించబడును. లోపలికి పోవు శ్వాసలో ముక్కురంధ్రముల వద్ద "సో" అను శబ్దమును, బయటికి వచ్చునప్పుడు "హమ్" అను శబ్దము ఉండుట వలన ఒక శ్వాసలో పూర్తి శబ్దమును చూస్తే **"సోహమ్"** అని తెలియుచున్నది. లోపలికి పోవు శ్వాసలో గల శబ్దములో 'సో' అను శబ్దము చివరిలో 'ఓ' అను శబ్దము కలదు. స+ఓ రెండు శబ్దముల కలయికే 'సో' అను శబ్దము. అందువలన 'సో' లో చివరి శబ్దము "ఓ" కలదు. బయటికి వచ్చు శ్వాసలో 'హమ్' శబ్దము కలదు కదా! దానియందు చివరిలో 'మ్' కలదు. సో, హం శబ్దములలో అంత్య శబ్దములను తీసుకొంటే **"ఓం"** అను శబ్దము బయటపడుచున్నది. మనిషి ఊరకయున్నా అతనిలో ఆడు శ్వాస ద్వారా ప్రతి శ్వాసయందు **"ఓం"** శబ్దము ఇమిడియున్నది.

ఒక దినమునకు 21,600 శ్వాసలు మనిషిలో ఆడుచున్నవి. ఏడు నాడీకేంద్రములలోని చైతన్య శక్తి (ఆత్మశక్తి) ఒక దినమునకు 21,600 మార్లు "ఓం" అను శబ్దమును ఉచ్ఛరించినట్లగుచున్నది. మనిషి ప్రమేయము

లేకుండా తనంతట తాను శ్వాసలోనే "ఓం" అను శబ్దమును చెప్పినట్లగుచున్నది. ఏడు నాడీకేంద్రములను మూడు భాగములుగా 'గాయిత్రీ'యని చెప్పుచూ దినమునకు 21,600 శ్వాసలు ఆడుచుండుట వలన ఆ శ్వాసలలో దినమునకు 21,600 మార్లు "ఓం" అను శబ్దము మంత్రముగా పలుక బడుచుండుట వలన మనిషి ప్రమేయము లేకుండా మనిషి జపించకనే జరుగు 'ఓం' మంత్రమును **"అజప గాయిత్రీ"**యని అనెడివారు. 'అజపగాయిత్రీ'గా యున్న శ్వాసలో మనస్సును చేర్చి ఆత్మయందు లగ్నము చేయడమును నిజమైన ఆరాధన అనెడివారు. అయితే హిందువులలో చాలామంది జ్ఞానము తెలుసును అని చెప్పుకొనెడి వారందరూ పూర్వము 'అజప గాయిత్రీ'యందు మనస్సును లగ్నము చేసి దైవ ఆరాధన, దైవ ప్రార్థన, లేక దైవ వందనము చేసెడివారు. అదికాస్తా కాలక్రమమున మారిపోయి లోపలి గాయిత్రిని వదలి బయట పదకొండు భాగములుగా యున్న గాయిత్రీ మంత్రమును ధ్యానించుచూ దానినే నిజమైన ప్రార్థన, లేక ఆరాధన అని అంటున్నారు. పూర్వమున్న 'అజప గాయిత్రి' విషయము తెలియగలిగితే నేడు చేయు గాయిత్రీ మంత్రమును శబ్దముల (మాటల) రూపముగా ధ్యానించు వారిది నిజమైన ఆరాధన కాదని చెప్పవచ్చును.

ముస్లీమ్‌లు చేయు నమాజ్‌ను గురించి ఖురాన్ గ్రంథములో (15-87) ఆయత్‌లో చెప్పియున్నా ఆ మాటను లెక్కచేయక మాటలతో కూడుకొన్న ఏడు ఆయత్‌లను తయారు చేసుకొని, వాటిని చదవడమే ధ్యానము (నమాజ్) అని అంటున్నారు. అదే విధానమునే హిందువులు కూడా అమలు చేయుచూ గాయిత్రీ మంత్రమును జపించుచూ అదే ఆరాధన అని అంటున్నారు. అంతటితో ఆగక హిందువులు గాయిత్రీ మంత్రమును సంస్కృత భాషలోనే చదువవలెననీ, సంస్కృతము రానివారు అజ్ఞానులన్నట్లు

చెప్పుచున్నారు. దైవ ఆరాధనకు సంస్కృత భాషయే ముఖ్యమని చెప్పుచూ, కొందరు నేర్వాలనుకొన్నా శూద్రులకు అటువంటి అవకాశమే లేకుండా చేయుచూ, శూద్రులు శుచి శుభ్రత లేనివారనీ, అటువంటివారు సంస్కృతమును నేర్వకూడదని ఆంక్షలు పెట్టారు. అట్లు చెప్పుచూ సంస్కృతమును అడ్డము పెట్టుకొని శూద్రుల మీద ఆధిపత్యమును పొంది, వారిమీద పెత్తనమును చెలాయించుచున్నారు.

హిందువులకంటే వెనుక కలియుగములో వచ్చినవారు ముస్లీమ్‌లు. ముందునుండి హిందువులలో కొందరు అగ్రవర్ణముల వారు 85 శాతము గల శూద్రుల మీద సంస్కృత భాషను అడ్డము పెట్టుకొని పెత్తనమును చెలాయించడమును చూచి, ముస్లీమ్‌లలో కూడా కొందరు చదువు వచ్చినవారు, మాటలు నేర్చినవారు పది శాతము మంది హిందువులలో జరుగు పెత్తందారీ విధానమును తాము కూడా తమ మతమునందు అవలంభించి, మిగతా 90 శాతముమంది ముస్లీమ్‌లను తమ చెప్పుచేతులలో పెట్టుకోవాలనుకొన్నారు. భక్తి, విశ్వాసములకు మారుపేరయిన అమాయక ముస్లీమ్‌లను, పెద్దల మాటలను గౌరవించు ముస్లీమ్‌లను తమ ఆధిపత్యములో ఉంచుకోవాలని, తాము చెప్పినట్లు వారందరూ వినునట్లు నమాజ్‌ను ఏడు వాక్యముల కూడికగా చేసి, ఆ నమాజ్‌ను ఏడు వాక్యములను అరబ్బీ భాషలోనే చదువవలెనను నియమమును ఉంచి, అరబ్బీ భాషరాని వారందరినీ తమ మాట వినునట్లు వారిమీద ఆధిపత్యమును కల్గియున్నారు. అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథమును కూడా భాష రాకపోయినా ఫరవాలేదు, అరబ్బీ భాషలోనే చదువవలెనను నియమమును ఉంచారు. దానివలన అరబ్బీ భాష రాని మిగతా దేశముల ముస్లీమ్‌లందరికీ పది శాతము మంది మాత్రమే గురువులుగా, ఇమామ్‌లుగా, మత పెద్దలుగా

చలామణి అగుచూ మిగతా 90 శాతము మందికి పెద్దలుగా చెప్పుకొంటున్నారు. ఖురాన్ అరబ్బీ భాషలో యుండుట వలన భారతదేశ ముస్లీమ్‌లకు ఖురాన్ జ్ఞానమే తెలియదు. ఖురాన్ గ్రంథములో దేవుడు చెప్పిన దానిని ఇతర ముస్లీమ్‌లకు చెప్పక తమకు తోచినది, తమకు తెలిసినది, తమకు ఇష్టమైనది చెప్పి జ్ఞానమును తెలియాలనుకొను వారిని ప్రక్కదారి పట్టించి దేవుని జ్ఞానము ఇదియని తెలియకుండా చేయుచున్నారు. ఏ విధముగా హిందువులలో కొందరు మిగతా హిందువులకు సంస్కృతము రాదని, వారిని అజ్ఞానులని చెప్పుచూ భాషను అడ్డము పెట్టుకొని ప్రజల మీద పెత్తనమును చెలాయించినట్లు, ముస్లీమ్‌లు కూడా తమ ప్రజల మీద తమ పెత్తనమును చెలాయించుటకు అరబ్బీ భాషను అడ్డము పెట్టుకొన్నారు. తర్వాత గ్రంథములో లేని నిబంధనలను పెట్టి చివరికి ఖురాన్ జ్ఞానమును కూడా అర్థము కాకుండా చేశారు.

**20) ప్రశ్న :- దేవుడు తన జ్ఞానమును తెలుసుకొమ్మన్నాడు గానీ హిందువులకు సంస్కృత భాషయనీ, ముస్లీమ్‌లకు అరబ్బీ భాషయనీ తన గ్రంథములో ఎక్కడా చెప్పలేదు కదా! అటువంటప్పుడు గాయిత్రీ మంత్రమును హిందువులు సంస్కృతములోనే చదువాలనీ, నమాజ్‌ను ముస్లీమ్‌లు అరబ్బీ భాషలోనే చదువాలని ఎక్కడయినా సూచన ప్రాయముగా అయినా చెప్పాడా?**

**జవాబు :-** దేవుడు సర్వులకు సమానముగా యున్నాడుగానీ కొందరికి దగ్గరగా, కొందరికి దూరముగా లేడు. మనుషులే వారి ఇష్టమొచ్చినట్లు నడుచుకొనుచూ కొందరు దేవునికి దూరముగా పోవుచున్నారు. కొందరు దేవుడు చెప్పినట్లే నడుచుకొనుచూ, తమ ఇష్టము ఏమీ లేకుండా ఉండుట

వలన దేవునికి దగ్గరగా పోవుచున్నారు. దేవునికి దూరము కావలెనన్నా, అట్లే దేవునికి దగ్గర కావలెనన్నా మనిషి **భావము** మీద, మనిషి **ప్రవర్తన** మీద ఆధారపడియుండును. దేవుని విధానమును, దేవుని జ్ఞానము ప్రకారము ఆచరించక తాము ప్రత్యేకముగా నిర్ణయించుకొన్న విధానము ప్రకారము నడుచుకొనువారు, ఇది తమ చట్టమనో, తమ నిబంధనయనో, తమకు గుర్తింపు ఆచరణయనో, మతమునకు అనుకూలమైన విధానమనో, ఏది చెప్పినా దాని ప్రకారము నడుచుకొనినా, దేవుడు చెప్పిన మాటను ప్రక్కనపెట్టినట్లు అగును. దేవుని జ్ఞానమును కించపరచినట్లు అగును. ఈ విషయములో జాగ్రత్తగా ఉండవలెను. దేవుడు చెప్పిన మాటలను అనగా జ్ఞానమును మనిషి అనుసరించవలెనుగానీ, మనిషి తన కొరకు ప్రత్యేకమైన దారిని, మత విధానమును కల్పించుకొన్నప్పుడు అది అజ్ఞాన మగును. దేవునికి వ్యతిరేఖమగును. దేవుడు "నేను చెప్పినది వదలి నీవు చెప్పిన దానిని నేనెందుకు వినాలి?" అని ప్రశ్నించగలడు.

దేవుని జ్ఞానము ముందర మనుషుల జ్ఞానము చాలా స్వల్పము. స్వల్ప జ్ఞానముగల మనిషి దేవునికి వ్యతిరేఖమయిన, దేవుడు ఎక్కడా చెప్పని విధానమును ఏర్పరచుకొని తాను చెడిపోవడమే కాక, "తాను చెడిన కోతి వనమెల్ల చెరచినట్లు" తాము చెడుదారిలో అజ్ఞాన మార్గములో నడువడమే కాక, ఇతరులను కూడా అదే దారిలోనికి రమ్మని పిలువడము 'ఎవరి తిక్క వారికి ఆనందమన్నట్లు' తెలియుచున్నది. హిందువుల విషయములో చూస్తే దేవుడు ప్రథమ దైవగ్రంథమును భగవద్గీతయను పేరుతో ఇచ్చినా, అందులోని దేవుని భావమును గ్రహించక, గ్రంథములో ఎక్కడా చెప్పని ఒక భాషను గొప్పదని చెప్పుచూ, సంస్కృత భాషలోనే దైవారాధన చేయవలెనని చెప్పడము, అదే దైవభాషయని చెప్పడము భాషతో సంబంధములేని దేవునికి భాషను

అంటగట్టి నీవు కూడా దీనినే నేర్చుకోమన్నట్లున్నది. భాష పాలించబడే వారే నేర్వగలగాలికానీ, పాలించే వారికి అవసరము లేదు. వారు అన్ని భాషల భావములను గ్రహించగలరు, అన్ని భాషలలో మాట్లాడ గలరు. ఇకపోతే దేవుడుగానీ, దేవుని ప్రతినిధియైన ఆత్మగానీ భాషలతో సంబంధము లేకుండా ఎవరు ఏ భాషను మాట్లాడినా అందులోని భావమును గ్రహించగలుగుచుందురు. ఈ విధముగా భాషతో సంబంధము లేకుండా కేవలము భావముతోనే సంబంధము గల దేవునికి కూడా భాషను అంటగట్టడము, ఫలానా భాషలోనే దేవున్ని చెప్పాలి అనడము, ఫలానా భాషే దేవునికి ఇష్టము అని చెప్పడము చూస్తే, దేవున్ని కూడా మనిషి స్థాయిలోనికి తెచ్చి మనుషులవలె దేవునికి కూడా భాషమీద ఇష్టాయిష్ట మున్నట్లు చెప్పడము దేవున్ని అగౌరవపరచినట్లు కాదా? అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథములో ఫలానా భాషలోనే గ్రంథమును చదవాలనిగానీ, ఫలానా భాషలోనే ప్రార్థన చేయాలనిగానీ ఎక్కడా చెప్పలేదు. ఇది అందరికీ సంబంధించిన జ్ఞానమన్నాడుగానీ అరబ్బీ భాష నేర్చిన వారికే అర్థమగు జ్ఞానమని చెప్పలేదు.

ఖురాన్ గ్రంథములో సూరా 81, ఆయత్ 27 లో ఇలా వ్రాయబడి యున్నది చూడండి.

**(81-27) "ఇది సమస్త లోకవాసుల కొరకు హితోపదేశము",** అట్లే **(6-90) "ఇది సర్వలోకాల వారి కొరకు ఒక హితోపదేశము."**

అని చెప్పబడియున్నది. ఈ వాక్యముల ప్రకారము చూస్తే సర్వ లోకవాసులకు ఒకే భాషరాదు కదా! కొన్ని దేశములలోని ప్రజలకు, కొన్ని ప్రాంతములలోని

ప్రజలకు అరబ్బీ భాష ఒకటున్నది అను విషయము కూడా తెలియదు. అన్ని దేశముల వారికి అరబ్బీ భాష వస్తుందని చెప్పలేము. వారి ప్రాంత భాష తప్ప ఇతర భాషలు తెలియని వారు ఎందరో గలరు. భారతదేశములోని ముస్లీమ్‌లకు అందరికీ అరబ్బీ భాష రాదు. ఇక్కడి ముస్లీమ్‌లలో పండితులయిన వారికి మాత్రమే అరబ్బీ భాష తెలిసియుండును. ముస్లీమ్‌లలో వేయిమందిలో ఒకరికయినా అరబ్బీ భాష వచ్చునని చెప్పలేము. ముస్లీమ్‌లకే అరబ్బీ భాష తెలియనప్పుడు మిగతా వారికి ఎలా తెలియగలదు. అప్పుడు దేవుడు ఇది సమస్త ప్రజలకని చెప్పిన మాట వ్యర్థమగును కదా! "సమస్త ప్రజలకు అవసరమైన హితోపదేశము" అని చెప్పినప్పుడు వారి భాషలో వారు ఖురాన్ గ్రంథమును (జ్ఞానమును) తెలియవచ్చుననియేగా అర్థము. దేవుని జ్ఞానము భూమిమీద ఏ ప్రవక్త ద్వారా చెప్పించినా, అది ఆ ప్రాంత భాషలో మాట్లాడు ప్రవక్త చేతనే దేవుడు చెప్పించాడని ఆధారము గలదు. అదే విషయమునే ఖురాన్ గ్రంథమందు 14వ సూరా, 4వ ఆయత్‌నందు ఇలా చెప్పారు చూడండి. **(14-4) "మేము ఏ ప్రవక్తను పంపినా, అతడు దైవ విషయాన్ని స్పష్టంగా విడమరచి చెప్పటానికి వీలుగా తన జాతివారి భాషలో మాట్లాడేవానినే పంపాము. ఆపైన అల్లాహ్ (దేవుడు) తాను కోరిన వారిని అపమార్గము పట్టిస్తాడు. అట్లే తాను కోరిన వారికి సన్మార్గమును చూపిస్తాడు. ఆయన సర్వాధిక్యుడు"** ఈ వాక్యము ప్రకారము చూస్తే దేవుడు తన జ్ఞానమును వారి ప్రాంత భాషలోనే తెలియుటకు ఆ ప్రాంత భాషను మాట్లాడే ప్రవక్తనే పంపుతాను అని చెప్పాడు అంటే అక్కడ ఒకే భాషకు ప్రాధాన్యత ఇవ్వలేదనీ, ఏ భాషలో అయినా జ్ఞానమును తెలియవచ్చుననీ, అలా వారికి తెలిసిన భాషలో

తెలియుటకు వారి భాష వచ్చిన ప్రవక్తనే పంపుతానని స్వయముగా అల్లాహ్ అయిన అతడే చెప్పాడు అంటే ఆయన మాటను కూడా లెక్కచేయక మేము జ్ఞానులము అనుకొని, ఒక మతమును అడ్డము పెట్టుకొని, ఆ మతము చాటున, ఆ మతమునకు అనుకూలమైన భాషను అడ్డము పెట్టుకొని ఈ మత ప్రజలందరూ అరబ్బీ భాషలోనే ప్రార్థన చేయాలి, గ్రంథము చదవాలి అని చెప్పడము (14-4) లో గల దేవుని ఉద్దేశ్యమునకు వ్యతిరేఖముగా మాట్లాడినట్లు కాదా! ఒక ప్రక్క మతమునకు అనుకూలముగా, మరోప్రక్క దేవునికి వ్యతిరేఖముగా మాట్లాడువారు దేవునికి విశ్వాసులవుతారా? వారిని ముస్లీమ్‌లని అనవచ్చునా? ముస్లీమ్ అనగా విశ్వాసి అనియూ, అల్లాహ్‌ను పూర్తి విశ్వసించిన వాడని అర్థము కదా! అల్లాహ్‌ను విశ్వసించిన వారు దేవుడు చెప్పిన దానికి వ్యతిరేఖముగా చెప్పుదురా? ఖురాన్ గ్రంథములో ఎక్కడగానీ అరబ్బీ భాషలోనే గ్రంథమును చదువమనిగానీ, ప్రార్థన చేయమనిగానీ లేనప్పుడు ఎందుకు అరబ్బీ భాషను గురించి చెప్పవలసి వచ్చినదని అడుగుచున్నాము? ఎవరయినా అడుగ గలరు? (14-4) వ ఆయత్‌నందు తనకు వ్యతిరేఖముగా మాట్లాడువారిని అనగా 'తనకు ఇష్టము లేనివారిని అపమార్గములో పంపుతాను' అని కూడా చెప్పాడు. తనకు ఇష్టమైన వారిని అనగా తన మాట ప్రకారము నడుచుకొను వారిని, తన జ్ఞానమును విశ్వసించు వారిని సన్మార్గములోనికి పంపుతాను అని చెప్పాడు. భాష విషయములో ఇటు హిందువులు, అటు ముస్లీమ్‌లు ఇద్దరూ తప్పుగా మాట్లాడుట వలన, దేవుడు చెప్పని విషయమును తామే స్వయముగా చెప్పుట వలన దేవుని విషయములో ఇద్దరూ తప్పు చేసినట్లేయగును.

**21) ప్రశ్న :- హిందువులు మాది అనే భగవద్గీత సంస్కృతములో తయారయి**

**నది. ముస్లీమ్‌లు మాదియనే ఖురాన్ అరబ్బీ భాషలో తయారయినది. అందువలన భగవద్గీతకు మాతృభాష సంస్కృత భాష అనీ, ఖురాన్‌కు మాతృభాష అరబ్బీ భాషయనీ చెప్పుచుందురు. దానివలన హిందువులకు సంస్కృత భాష ముఖ్యమనీ, ముస్లీమ్‌లకు అరబ్బీ భాష ముఖ్యమని కొందరు చెప్పుచున్నారు. అట్లు చెప్పుట న్యాయమా?**

**జవాబు :–** భగవద్గీతను వ్రాసినా, ఖురాన్‌ను వ్రాసినా వ్రాసిన వాడు మనిషి అయినందున ఆ ప్రాంతములో అందరూ వ్రాయు భాష ఏదయితే ఉందో అదే భాషలో వ్రాసియున్నారు. అది ఆ ప్రాంతవాసులు చదువుటకు అనుకూలముగా యుండును. ఒకవేళ భగవద్గీత కేరళ రాష్ట్రములో చెప్పియుంటే అక్కడ ప్రాంతీయ భాష ఏదయితే ఉందో అదే భాషలో భగవద్గీత వ్రాయబడియుండేది. భగవద్గీత కేరళలో బోధింపబడియుంటే తప్పనిసరిగా ఆ ప్రాంత భాష అయిన మళయాల భాషలో వ్రాసియుండేవారు. మళయాల భాష ఆ ప్రాంతములోనే తెలియును. ప్రక్కనేయున్న తమిళనాడులో గానీ, ఆంధ్రలోగానీ తెలియదు. అందువలన మొదట గ్రంథము తయారయిన భాషలోనే గ్రంథమును చదవాలి ఇతర భాషలో చదువకూడదను నియమము పనికిరాదు. ఏ గ్రంథమును ఎవరూ అలా చదువలేరు. అందరూ చదువుటకు ఒక భాషలో తయారయిన దానిని అనేక భాషలలోనికి మార్చి వ్రాసుకొని చదువుకొంటున్నాము. కాళిదాసు కవి తెలుగులో "పారిజాతాపహరణము" అను కావ్యమును వ్రాయగా అది మిగతా భాషలలోనికి కూడా చేరిపోయినది. అప్పుడు కాళిదాసు వ్రాసిన విషయమేదో మిగతా ప్రాంత ప్రజలకు సులభముగా తెలిసిపోయినది. అలా కాకపోతే అది తెలుగులోనేయుంటే తెలుగు ప్రజలకు మాత్రము పరిమితమై పోయేది. తెలుగులో తప్ప ఇతర భాషలో చదవకూడదు అని చెప్పియుంటే, అందులో గూడార్థము ఇతర ప్రజలకు కాళిదాసు వ్రాసినది తెలియకూడదనేగా అర్థము.

అదే విధముగా నేడు ఖురాన్ గ్రంథము యొక్క జ్ఞానము ముస్లీమ్ లందరికీ తెలియకూడదని కొందరు ముస్లీమ్‌లు అనుకొనియుండడము వలన దానిని ముస్లీమ్‌లందరూ అరబ్బీ భాషలోనే చదవాలని నియమమును పెట్టారు. ఒక అరబ్బీ దేశములో తప్ప ఇతర దేశములలో అరబ్బీ భాష రాని దానివలన ముస్లీమ్‌లు ఖురాన్ చదువలేరు. వారికి ఖురాన్ జ్ఞానము తెలియదు. కొందరు ఖురాన్‌ను చదివే నిమిత్తము అరబ్బీ భాష లిపిని నేర్చుకొని చదువగలిగినా, భాష అర్థము తెలియకపోవడము వలన దానివలన ఏ ప్రయోజనము లేదు. గ్రంథములోని విషయమేదో ఏమాత్రము తెలియదు. అది చదివే నిమిత్తము నేర్చుకొన్నదే గానీ అర్థమగుటకు కాదని తెలియుచున్నది. మొత్తము మీద ముస్లీమ్‌లు అరబ్బీ భాషలోనే చదువవలెనను నియమమును పాటించడము మతపరమైనదగుట వలన దానిని అతిక్రమించి పోకున్నారు. నేడు ప్రాంతీయ భాషలలోనికి ఖురాన్ వ్రాయబడినది. తెలుగు భాషలో తయారయిన ఖురాన్ గ్రంథములను తెలుగు వారికి కొందరు ముస్లీమ్ పెద్దలు ఉచితముగా ఇస్తున్నారు. అయితే అది తెలుగు వచ్చిన హిందువులు చదువు నిమిత్తమే ఇస్తున్నారు. అదే తెలుగు ఖురాన్ గ్రంథమును ముస్లీమ్‌లకు ఒక్కరికి కూడా ఇవ్వడము లేదు. తెలుగులో హిందువులు చదివి తమ మతములో చేరాలను ఉద్దేశ్యముతో ఖురాన్‌ను తెలుగులోనికి అనువదించారు తప్ప వేరే ఉద్దేశ్యము లేదు. నేడు కొందరు హిందువులు తమ మతమును వీడి ఇస్లామ్‌వైపు ఆకర్షితులై ముస్లీమ్‌లుగా మారిపోయిన వారు గలరు. మతమును మార్చుకొని ముస్లీమ్‌లుగా తయారయినవారు దేవుని ప్రార్థనను అనగా నమాజ్‌ను అరబ్బీలోనే చదువుచున్నారు. అరబ్బీ రాకపోయినా పదాలను కంఠస్థము చేసి చదువుచున్నారు. అలా చదవడము వలన ఆ ప్రార్థన యాంత్రిక

మైనదిగా యున్నది. అందులోని అర్థము తెలియకపోవడము వలన చదివే ప్రార్థనలో భావము ఏమాత్రము లేదు. దానివలన ఏ ప్రయోజనము ఉండదు. దేవునికి భాష ముఖ్యము కాదు. భాషను చూడదు. దేవుడు భావమును మాత్రము గ్రహించగలడని ముందే చెప్పాము. అటువంటప్పుడు మనిషిలో భావము లేకుండా భాషతో ప్రార్థనను చదివినా ఆ ప్రార్థనను దేవుడు స్వీకరించడు. అందులో భాష ఉందిగానీ భావము లేదు. దేవునికి భాషతో పనిలేదు, భావముతోనే పనియగుట వలన భావములేని ఆరాధన వ్యర్థమగును.

హిందువులు సంస్కృతములో మంత్రమును నేర్చి గుడిలో చదివినా అది అక్కడగల విగ్రహాలు వినునుగానీ, దేవుడు మాత్రము వినడు. సంస్కృత భాషను దేవుడు గ్రహించడుగానీ మనిషిలోని భావమును గ్రహించును. అటువంటప్పుడు ఆరాధన చేయవలెనని చేయుచున్నాడుగానీ తనకు జ్ఞానము కావాలనిగానీ, మోక్షము కావాలనిగానీ, అతని భావములో లేకపోవడము వలన ఆరాధన చేయు వానికి దేవుని వైపు నుండి ఎటువంటి లాభము ఉండదు. అదే విధముగా ముస్లీమ్‌లు ముస్లీమ్‌ల నియమము ప్రకారము నమాజ్ అరబ్బీ భాషలో చేసినా, వారిలోని భావము ఏమీ లేనందున వారికి దేవుని వైపునుండి ఎటువంటి ప్రయోజనము ఉండదు. అర్థము తెలియకుండా అరబ్బీ భాషలో నమాజ్ చేసినా ఆ భాషను దేవుడు చూడడు, భావమును మాత్రము చూచును.

**22) ప్రశ్న :- మీరు హిందువులు కావున మీరు భగవద్గీతను గురించి మాట్లాడవచ్చును అట్లే ఆరాధన విషయమై గాయిత్రీ మంత్రమును గురించి మాట్లాడవచ్చును. అయితే ముస్లీమ్‌లకు సంబంధించిన ఖురాన్ గురించి వ్రాయడము ఇతరుల విషయములో వేలు పెట్టినట్లు కాదా? ఇతరుల**

**విషయము వారికే వదిలివేసి, మీరు మీ మతము, మీ గ్రంథము వరకు మాట్లాడడము సరియైన పద్ధతి అవుతుంది కదా?**

**జవాబు :-** ఖురాన్ ఒక మతమునకు సంబంధించిన గ్రంథము కాదు. అట్లే భగవద్గీత కూడా హిందువులకు సంబంధించినది కాదు. భగవద్గీత హిందువులది, ఖురాన్ ముస్లీమ్‌లది అనడము పూర్తి తప్పు. ముస్లీమ్‌లు ఖురాన్‌కు, హిందువులు భగవద్గీతకు అలవాటు పడియుండవచ్చును. అంత మాత్రమున గీత వారిది కాదు, ఖురాన్ వీరిది కాదు. దైవగ్రంథము ఏదయినా సమస్త మానవులకు సంబంధించినదిగా ఉండును. ఏ మతమునకు సంబంధించిన మనిషి అయినా తనకు అలవాటయిన గ్రంథమునే కాక మూడు దైవగ్రంథములను సమానముగా గౌరవించ వలసిన బాధ్యత అందరికీ ఉంది. మూడు దైవగ్రంథములను బాగా పరిశీలించి చూస్తే **మూడు గ్రంథములలో ఒకే దేవుడు, ఒకే దేవుని జ్ఞానము కలదు.** అటువంటప్పుడు భేదము చూపుటకు అవకాశమే లేదు. మతములలో, ఆచరణలలో, ఆరాధనలలో భేదము ఉండవచ్చును గానీ దేవుని జ్ఞానములో ఏ భేదము లేదు. అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథములో ముందు వచ్చిన రెండు గ్రంథములలోని జ్ఞానమే తనయందు కలదనీ, ముందు వచ్చిన భగవద్గీత (తౌరాత్), ఇంజీలు (బైబిలు)లో **జ్ఞానజ్యోతి, మార్గదర్శకత** కలదని ధృవీకరించినట్లు అనేక చోట్ల చెప్పబడినది. దీనినంతటినీ గమనించిన తర్వాత మూడు దైవగ్రంథములను సమానముగా చూడని వానిని అజ్ఞాని క్రిందికి జమకట్టవచ్చును. మూడు దైవగ్రంథములలో ఒకటి గొప్ప, ఒకటి తక్కువ అని చెప్పుటకు ఎక్కడా ఆధారము లేదు. ఇదంతయూ గమనించకుండా ఇది మా గ్రంథము అని ఎవరూ, ఏ మతస్థుడూ మాట్లాడకూడదు. ఒక ముస్లీమ్ పండితుడు ఖురాన్ గ్రంథమును గురించి ఎంత మంచి అభిప్రాయమును తెలిపాడో ఒకమారు చూస్తాము.

'ఖురాన్ భావామృతము' అనువాదకులయిన అబుల్ ఇర్ఫాన్‌గారు వారి మనోభావమును తన గ్రంథములో ఉపోద్ఘాతమందు ఇలా తెలిపాడు చూడండి.

**"ఏదైనప్పటికీ ఖుర్‌ఆన్ యావత్తు మానవాళికోసం అవతరించిన అంతిమ దైవగ్రంథం. ఇది ప్రపంచ మానవులందరి ఉమ్మడి సొత్తు. దీనిపై ఏ ఒక్క జాతికీ, వర్గానికీ గుత్తాధిపత్యం లేదు. గాలి, నీరు, సూర్యరశ్మి మొదలైన ప్రకృతి వనరుల్ని మానవుడు ఎలా వినియోగించుకొని ప్రయోజనం పొందుతున్నాడో ఖుర్‌ఆన్ వల్ల కూడా అలాగే ప్రయోజనం పొందవచ్చు. ఇది ఇహలోకంలో మానవుల మార్గదర్శనం కోసం, పరలోకంలో వారి ముక్తిమోక్షాల కోసం సర్వేశ్వరుడు పంపిన ఏకైక హితవాణి. ఇందులో సత్యాన్వేషకులకు ఆసక్తికరమైన అనేక విషయాలున్నాయి. అంచేత సత్యాన్ని ప్రేమించి, మోక్షాన్ని కోరుకునే ప్రతి ఒక్కరూ కనీసం ఒక్కసారైనా ప్రశాంతంగా ఆలోచించి దీన్ని అధ్యయనం చేయవలసిన అవసరము ఎంతయినా వుంది.**

**అబుల్ ఇర్ఫాన్**

(అనువాదకుడు)

ఇర్ఫాన్‌గారు చెప్పినట్లు ఒక దైవగ్రంథము ఏదికాని ఒక మతమునకు సంబంధమేలేదు. ఏ దైవగ్రంథమయినా అది మత గ్రంథము కాదు. అందులో మత నియమములు ఉండవు. భగవద్గీతగానీ, బైబిలుగానీ, ఖురాన్ గ్రంథముగానీ ముందు వెనుక తయారైనవే తప్ప అన్నీ సమాన గ్రంథములే. మూడు గ్రంథములు మనుషులకు అందరికీ సమానముగా ఒకే జ్ఞానమును అందిస్తున్నవిగానీ కొంతయినా తేడా చూపలేదు. మూడు

గ్రంథములు సమస్త మానవులకని అర్థమగునట్లు **"సమస్త మానవులారా!"** యని గ్రంథములో సంబోధించి చెప్పడము జరిగినది గానీ, ఎక్కడా మతము పేరుపెట్టి చెప్పలేదు. మతమునకు సంబంధము లేకుండా ఒక పథమునకు సంబంధించిన బోధను చెప్పడమైనది. మనిషి దైవగ్రంథములను చూచిన తర్వాత అందులోని దైవపథమును (దైవమార్గమును) గ్రహించక పథమును వదలి మతమును స్వయముగా తయారుచేసుకొన్నాడు. దైవమార్గమునకు సంబంధించిన జ్ఞానము ప్రకారము మాట్లాడక ప్రపంచ సంబంధమైన మతమునకు సంబంధించి మాట్లాడుచున్నాడు. ఎవరయినా సాధారణ మనషులు మాట్లాడితే వారి తెలివితక్కువ అని సరిపెట్టు కోవచ్చును. అట్లుకాక మేధావులయిన వారు, అంతో ఇంతో జ్ఞానమున్నదని పేరుగాంచిన వారు కూడా పథమును వదలి మతమునకు సంబంధించిన మాటలు మాట్లాడడము చూస్తే నేడు అజ్ఞానము తారాస్థాయికి చేరిందని అనుకోక తప్పదు. ఇటువంటి సమయములో **దేవునివైపు ఉన్నవారు, దేవుని జ్ఞానము తెలిసినవారు, మతముల భేదము లేని జ్ఞానులు, దైవగ్రంథములను మూడింటిని సమానముగా చూచు సమతుల్యులు, దేవుని జ్ఞానమే ఊపిరిగా బ్రతుకుచున్న యోగులు, జ్ఞానులు** అందరూ కలిసి దైవజ్ఞానములోని నేటి కలుషితమును తీసివేసి స్వచ్ఛమయిన దైవజ్ఞానము ప్రజలకు లభింప చేయవలసిన అవసరమున్నది.

**23) ప్రశ్న :- మాతృభాష అంటే భాషకు తల్లిభాషయని తేల్చి చెప్పారు. అయితే నేడు ప్రజలలో మీరు చెప్పిన వివరము ఏమాత్రము తెలియదు. ఒక గ్రంథము ముందు ఏ భాషలో తయారయివుంటే ఆ భాషనే మాతృ భాషయని గ్రంథమునుబట్టి చెప్పుచున్నారు. మరికొందరు మనిషి పుట్టిన తర్వాత మొదట ఏ భాష నేర్చుచున్నాడో ఆ భాషనే మాతృభాషయని**

**అంటున్నారు. ఇక్కడ మనిషికి మొదట వచ్చిన భాషను మాతృభాషయని అనడము జరుగుచున్నది. మీరేమో ఒక భాష మరొక భాషనుండి పుట్టుచున్నదని ఏ భాషనుండి రెండవ భాషపుట్టినదో దానికి మొదటి భాష మాతృభాషయని అన్నారు. ఇప్పుడు మూడు రకముల భావములు ఏర్పడినవి. ఇందులో గ్రంథమునుబట్టి చెప్పినది సత్యమా? మనకి మొదట వచ్చిన భాష సత్యమా? అదియుగాక భాష పుట్టుకకు కారణమైన భాష మాతృభాషయనడము సత్యమా అను సందిగ్ధత ఏర్పడుచున్నది? దీనికి మీరు ఏమంటారు?**

**జవాబు :-** నేను చెప్పినది సహజమైన అర్థము. నేను చెప్పిన విధానము తర్వాత కొంతవరకు ఒప్పుకొనుటకు అవకాశమున్నది. మనిషి మొదట నేర్చిన భాషను మాతృభాషయని అనవచ్చును. దానికంటే వేరుగా చెప్పిన గ్రంథమును ఏ భాషలో వ్రాసియుంటే అదే మాతృభాషయని, ఆ భాషలోనే ఆ గ్రంథమును చదువవలెనని చెప్పడము ఆధారము లేని అహేతుక మాట యగును. ఎందుకనగా! గ్రంథమునకు ప్రాణము లేదు. మనుషులకు వచ్చిన భాషలో వ్రాసి అది మనిషి నుండి వచ్చిన భాషయనక, గ్రంథము భాషయని దానిలోనే చదువవలెనని చెప్పడము వలన, మనిషికి సంబంధించిన భాషను గొప్పగా చేసినట్లగుచున్నది. మనిషికి వచ్చిన భాషను గ్రంథము మీద వ్రాసి అదే అందరికీ మాతృభాష కావలెనని అనుకోవడము తన భాషను మనిషి ఇతరుల మీద రుద్దడమే తప్ప ఏమీ లేదు. గ్రంథములోని భావము తెలియుట ముఖ్యముగానీ భాష తెలియుట ముఖ్యము కాదు. ఒక విధముగా అర్థమగుటకు ఉదహరించి చెప్పితే ఇలా చెప్పవచ్చును. భాష స్థూల శరీరములాంటిది. భావము సూక్ష్మ శరీరములాంటిది. భాష తెలిసిన వానికి ఆ భాషలో వ్రాయబడిన భావము కూడా తెలియును.

ఒకవేళ భాష తెలిసినా అందులోని భావము తెలియకపోతే సూక్ష్మము లేని స్థూలమును పట్టుకొన్నట్లగును. అనగా జీవము లేని శరీరమును పట్టుకొన్నట్లగును. ఇంకో విధముగా చెప్పితే ప్రాణము లేని శవమును పట్టుకొన్నట్లు. పైన శరీర ఆకారము ఎలా యున్నా లోపలి ప్రాణము శరీరమునకు ముఖ్యము. లోపలి ప్రాణము లేని శరీరము ఆశ్రయించిన వానికి ఏ ప్రయోజనము ఎట్లుండదో అట్లే భావము లేని భాషయుండును.

నేను దంత వైద్యుడుగా (డెంటల్ డాక్టరుగా) పనిచేయు ఒక ముస్లీమ్‌ను "మీరు ఖురాన్ గ్రంథము చదివారా?" అని అడిగాను. అప్పుడు అతను వెంటనే "చదివాను" అన్నాడు. అప్పుడు "నీకు బాగా అర్థమయినదా!" అని అడిగాను. దానికి అతను చిన్నగా నవ్వి "నేను చదివింది అరబ్బీ భాషలో, అరబ్బీ భాషను చదవడానికి మాత్రము నేర్చుకొన్నాను. భాష పూర్తిగా తెలియదు. కేవలము చదివేదానికి లిపిని నేర్చుట వలన దానిలోని భావము పూర్తి తెలియదు" అన్నాడు. ఈ విధముగా హైదరాబాద్‌లో ఒక డాక్టరు చెప్పగా, నెల్లూరులో ఒక ముస్లీమ్ మహిళను అడుగగా ఆమెకూడా అలాగే చెప్పింది. "పండితులకే అరబ్బీ భాష అర్థము తెలుసు. మాకు అర్థము తెలియదు. చదివే దానికి మాత్రమే నేర్చుకొన్నాము" అని చెప్పారు. ఈ విధముగా చూస్తే వారికి పై శరీరము దొరికిందిగానీ లోపల ప్రాణమున్న శరీరము దొరకలేదని తెలిసినది. అప్పుడది గ్రంథమునకు సంబంధించిన ఇతరుల భాషేగానీ వాస్తవముగా గ్రంథముతో పుట్టిన భాషకాదు. దీనినిబట్టి మనిషికి మొదట వచ్చిన భాషను మాతృభాషయనినా తప్పులేదుగానీ గ్రంథములో వ్రాసిన భాషను మాతృభాషయని అనకూడదు. మనిషికి వచ్చిన భాషయే గ్రంథముగా వ్రాయబడుట వలన మనిషికి వచ్చిన భాషను మాతృభాషయని చెప్పుటలో తప్పులేదు. భాషకు తల్లిగా వేరే భాషయున్నా,

మనిషికి వచ్చిన భాష ఆ మనిషికి తల్లిలాగయున్నది. కనుక మనిషి తనకు తల్లి భాషయని ఏ భాషను చెప్పినా ఫరవాలేదుగానీ, గ్రంథమునకు మాతృభాష ఉండదు.

ఒక మనిషి తనకు వచ్చిన భాషలో గ్రంథమును చదవడమును మాతృభాషలో చదవడము అని చెప్పవచ్చును. మనిషి ఒక గ్రంథమును వ్రాసిన భాషలోగానీ, అనువాద భాషలోగానీ చదవవచ్చును. గ్రంథములోని భాష మనిషికి వచ్చినప్పుడు చదువగలడు. అదే గ్రంథము వేరే భాషలో యుంటే చదవడము కుదరదు. చదవకపోతే అందులోని అర్థము తెలియదు. భాష తెలిసి చదివినచో గ్రంథములోని భావము మనిషికి పూర్తిగా తెలియు చున్నది. అందువలన తెలియని భాషలోని గ్రంథమును చదువుటకంటే తెలిసిన భాషలోని గ్రంథమును చదువుట ఉత్తమము. 'ప్రాణములేని శవమును ఆశ్రయించుటకంటే ప్రాణమున్న మనిషిని ఆశ్రయించుట మేలు' అన్నట్లు సంస్కృత భాషలో భగవద్గీతను చదువుటకంటే తెలిసిన భాషలో దేనిలోనయినా మనిషి గీతను చదువవచ్చును. మనిషి పుట్టిన తర్వాత నేర్చిన భాష ఒక్కొక్క ప్రాంతములో ఒక్కొక్కటిగా యున్నది. కర్నాటక రాష్ట్రములో వారు కన్నడ భాష మొదట నేర్చుట వలన ఆ ప్రాంతము వారికందరికీ కన్నడ భాష మాతృభాష యగును. అట్లే సుగాలి (బంజారా) వాళ్ళకు మొదట వచ్చునది వారి భాషేయగుట వలన వారికి మాతృభాష బంజారా భాషయగుచున్నది. ఇట్లు అన్ని ప్రాంతముల వారికి భాష యుండుట వలన అన్ని ప్రాంతముల వారికి వారి ప్రాంతీయ భాషలే వారికి మాతృభాషలుగా ఉన్నాయి. గ్రంథమును బట్టి మాతృభాషలు ఉండవు.

**24) ప్రశ్న :- ప్రార్థన ఏ భాషలో చేయాలి?**

**జవాబు :–** నీకు వచ్చిన భాషలోగానీ, నీకు నచ్చిన భాషలోగానీ ప్రార్థన చేయవచ్చును.

**25) ప్రశ్న :– భగవద్గీత సంస్కృత భాషలో యున్నది. ఖురాన్ అరబ్బీ భాషలో యున్నది. భగవద్గీతనుగానీ, ఖురాన్ గ్రంథమునుగానీ ఏదయినా అది తయారయిన భాషలోనే చదువవలెనని కొందరు అంటున్నారు. దీనిని గురించి మీరు ఏమంటారు. మీ భావమును తెలుపమని కోరుచున్నాము?**

**జవాబు :–** దైవ విషయములన్నియూ బ్రహ్మవిద్యా శాస్త్రములయిన భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములలో ఉండును. ప్రపంచ విషయములను మనుషులు చెప్పుదురు. దైవ విషయములను దేవుడు చెప్పును. ఇప్పుడు నీవు అడిగినది దైవ విషయము. అందువలన ఈ విషయమును మూడు దైవ గ్రంథములను చూచి దేవుడు చెప్పినట్లు నడుచుకోవలెను. ఈ విషయములో మనుషుల మాటలు వినకూడదు. మూడు గ్రంథములలో ప్రార్థన చేయమని ఉన్నది కానీ ఫలానా భాషలోనే చేయమని ఎక్కడా చెప్పలేదు. అయితే మనుషులు ఆ మాటలను చెప్పుచూ గ్రంథము తయారయిన భాషలోనే ప్రార్థన చేయాలి అనీ, హిందువులు భగవద్గీత తయారయిన సంస్కృత భాషలోనే ప్రార్థించాలనీ, ముస్లీమ్‌లు ఖురాన్ తయారయిన అరబ్బీ భాషలోనే నమాజ్ చేయాలని చెప్పుచున్నారు. దేవుని ప్రార్థన దైవ విషయమై యుండుట వలన దేవుని మాటను వినాలిగానీ, మనుషుల మాటలు వినకూడదు. మనుషుల మాటలను వదలి దేవుని భావమును అనుసరించాలి.

(ఇంతవరకు మూడు మతముల సంబంధముగా నేను ప్రశ్నలను అడిగాను. ఈ ప్రశ్నలలో కొన్ని ప్రశ్నలకు నాకు జవాబు తెలిసినా ప్రజలు

జ్ఞానవంతులగుటకు అడిగాను. మీరు ఇచ్చిన జవాబులు హేతుబద్ధముగా యుండి నాకు తృప్తిని ఇచ్చాయి. ఇప్పుడు నా స్వంత ప్రశ్నలను అడుగకుండా ఇంతకుముందు ఇద్దరి మధ్య జరిగిన వాద సంవాదములలో ఒకవైపునుండి వచ్చిన మాటలను ప్రశ్నలుగా చేసి అడగాలనుకొన్నాను. రెండువైపుల మాట్లాడినవారు అతిరథ మహారథులే. ఇద్దరిలోని మాటలను కాక ఒకవైపునుండి వచ్చిన వాటినే ప్రశ్నలుగా అడుగుచున్నాను. ఇస్లామ్ మతములో పెద్ద మనిషి అయిన వ్యక్తి, జ్ఞాని అని గుర్తింపు పొందిన వ్యక్తి, కొందరికి బోధకుడుగాయున్న వ్యక్తి, ఒక ఇస్లామ్ ఆధ్యాత్మిక సంస్థను నడుపు వ్యక్తి మాట్లాడిన ధోరణికి బహుశా ఎవరూ జవాబులు ఇవ్వలేదు అని అనుకుంటాను. అటువంటి వ్యక్తి మాటలలోని సత్యాసత్యమును మీరు మాత్రమే తేల్చి చెప్పగలరను నమ్మకముతో అడుగుతున్నాను. మీ దృష్టిలో ఆధ్యాత్మిక భావము తప్ప మిగతా భావముండదు, కనుక ఎదుటివాడు ఎంతటివాడయినా వారిని చూడకుండా వారి జ్ఞానమును మాత్రము చూడగల మీరు వారి మాటలలో న్యాయాన్యాయము, సత్యాసత్యమును తేల్చి చెప్పగలరను నమ్మకముతో ఇప్పుడు ప్రశ్నించుచున్నాను. ఈ విధముగా అడగడము ఇద్దరి మధ్య మాటల తంటా పెట్టి తమాషా చూడవలెననునది నా ఉద్దేశ్యము కాదు. ఈ చర్చలోని జవాబుల వలన ఎందరో ప్రజలు మీ ద్వారా జ్ఞానవంతులగుదురని మేము తలచుచున్నాము. ఇతరుల మాటలను ప్రశ్నలుగా అడిగినందుకు క్షమించండి.)

**26)** ప్రశ్న **:- మనిషి దేవున్ని విశ్వసించడము అంటే తన ఇష్టాయిష్టాలు వదలడము మరియు దేవుని కొరకు జీవించడము. అయితే మనకు వచ్చిన నిర్ణయాలు దైవధర్మములు అనుకోవడము తప్పుకదా! ఎవరయినా మూడు మత ధర్మములలో తనకిష్టమైన ధర్మము ప్రకారము జీవించవచ్చును గానీ**

**దాని నియమాలలో మార్పు చేయాలి  అనుకోవడము తప్పు కదా!  ఇది ఇస్లామ్‌లో ఏనుగులాంటి వ్యక్తి యొక్క అభిప్రాయము.  మీరు మూడు మతములలో ఎవరిది తప్పయినా  తప్పును తప్పుగా చెప్పడము ఒప్పును ఒప్పుగా చెప్పడము మీ ప్రవృత్తి.  దేవుని విషయములో దైవగ్రంథముల అనుసారము  తీర్పు చెప్పు మీరు  ఈ విషయములో ఇక్కడ చెప్పిన ముస్లీమ్ పెద్ద యొక్క ఉద్దేశ్యము సరియైనదేనా? అని అడుగుచున్నాను.  దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** జవాబు చెప్పేవానికంటే ప్రశ్న అడిగేవాడే మేథావియై ఉంటాడని పెద్దలు చెప్పుచుందురు.  అలాగే ఈ ప్రశ్నకు నీకు జవాబు తెలిసియుండును అయినా  నీవు నా ద్వారానే జవాబు తీసుకోవాలని ప్రయత్నించుచున్నావు. సరే! నీవు అడిగిన దానికి నేనెందుకు జవాబు చెప్పకూడదు.  తప్పక చెప్పుతాను శ్రద్ధగా విను!  దేవున్ని విశ్వసించడము అంటే దేవుని కొరకు బ్రతికినట్లేయనడము మంచిదే.  అయితే ఇష్టాయిష్టములు వదలడము అని చెప్పడములో కొంత అజ్ఞానము కనిపించుచున్నది.  మనిషికి ఇష్టా యిష్టములున్నా అవి కర్మనుబట్టి జరుగుచుండును.  ముందే నిర్ణయించిన ముందే కర్మపత్రములో వ్రాసియుంచిన కర్మప్రకారము మనిషి యొక్క ఇష్టాయిష్టముల ప్రమేయము లేకుండా పనులు జరుగుచుండును.  అప్పుడు వదలినా వదలక పోయినా ఒక్కటేయగును.  జ్ఞానము తెలియక ముందు మనిషికి ఇష్టాయిష్టములుండును.  జ్ఞానము తెలిసిన తర్వాత అవి తాను అనుకొన్న ప్రకారము జరుగవని తెలిసి  వాటి ధ్యాసను మనిషి వదలి వేయును.  దేవుని విశ్వాసము కల్గిన మనిషి  దేవుని జ్ఞానము తెలిసిన వాడగును.  దేవుని జ్ఞానము తెలిసిన వానికి ఇష్టమున్నా ఇష్టము లేకపోయినా ఏది జరుగవలెనో అదే జరుగునని తెలిసియుండును.  అందువలన అజ్ఞానికి

ఉన్నట్లు జ్ఞానికి ఇష్టము ఉండదు, అయిష్టము ఉండదు. రెండవ విషయానికి వస్తే "మనకు నచ్చిన నిర్ణయాలు దైవ ధర్మములనుకోవడము తప్పు కదా!" యని అన్నారు.

మనిషి శరీరములో నుండి వచ్చు నిర్ణయాలు దైవధర్మములు కావు. ఒకవేళ అలా అనుకోవడము ఉంటే అది తప్పేయగును. దైవధర్మములు దేవుని గ్రంథముల ద్వారా తెలియును. లేకపోతే దేవుడు అవతరించి బోధించిన బోధ వలన తెలియును. అనగా దేవుడు భగవంతునిగా పుట్టి అధర్మములను లేకుండా చేసి, ధర్మములను ప్రతిష్ఠించినప్పుడు ధర్మములు తెలియును. మనిషికి నచ్చిన నిర్ణయాలు ధర్మములనుటకు వీలు లేదు. అయితే ఇక్కడ అడిగిన వ్యక్తి ముస్లీమ్ అని ముందే తెలిసింది కావున వారు 'దేవుడు అవతరిస్తాడు' అని నమ్మరు. దేవుడు అవతరిస్తాడు అని నమ్మకపోవడము అది మనిషి నిర్ణయమే అగును కదా! ప్రథమ దైవ గ్రంథము గీతలోనూ, అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లోనూ చాలాచోట్ల **"దేవుడు అవతరిస్తాడు"** అని చెప్పియున్నా దానిని ప్రక్కన బెట్టి మనుషుల నిర్ణయమైన "దేవుడు అవతరించడు" అను మాటనే సమర్థించడము తప్పుకాదా! ఇకపోతే "ఏ మత ధర్మము ప్రకారమైనా మనిషి జీవించవచ్చును గానీ దాని నియమములలో మార్పు చేయాలి అనుకోవడము తప్పు కదా!" అన్నారు. దీని విషయమై మాట్లాడితే ఎవరయినా తనకు ఇష్టమైన ధర్మము ప్రకారము జీవించవచ్చును అన్నప్పుడు ధర్మములను రెండుగా చీల్చి ఆ రెండిటిలో మనిషి ఏ ధర్మము ప్రకారము జీవించాలనుకొన్నాడో చూడాలి. ధర్మములలో దేవుని ధర్మములు గలవు, ప్రపంచ ధర్మములు గలవు. ప్రపంచ ధర్మములను ప్రకృతి ధర్మములు అని కూడా అనవచ్చును. దేవుని ధర్మములు ఎప్పటికీ మారునవి కావు. ఒకరు మార్చితే మారవు. ప్రకృతి ధర్మములైతే

మారగలవు. మనుషులు మార్చవచ్చును. ప్రకృతి ధర్మములన్నీ మానవుని కర్మనుబట్టి జరుగుచుండును. దేవుని ధర్మములు మారవు, ఎవరూ మార్చలేరు. దేవుని ధర్మాలను మార్చాలను ఊహ కూడా ఎవరికీ రాదు. ఎందుకనగా! మానవుని అంచనాకు మించినవి దేవుని ధర్మములు. మీ ప్రశ్నలో ఏ ధర్మములను గురించి అడిగారో? ఒకమారు చూచుకోండి. మీరు అడిగినది మత ధర్మములను గురించి, మూడు మత ధర్మములలో మీ కిష్టమైన ఏ ధర్మములో అయినా జీవించవచ్చునుగానీ, ధర్మముల నియమాలను మార్చాలనుకోవడము తప్పు కదాయన్నారు. మీరు అడిగిన ధర్మములు దైవ ధర్మములను గాదు, ప్రపంచ సంబంధ ధర్మములని తెలియుచున్నది. దైవ ధర్మములలో మత ధర్మములు ఉండవు. మొదటికి మతము అనునది దైవికముగాని విషయము. మతము యొక్క ప్రాతిపదిక మీద దేవుని ధర్మములు ఉండవు. మతము అను దానిలో నియమాలు ఉంటాయి గానీ, దేవుని ధర్మాలలో నియమాలు ఉండవు. అన్నీ శాసనాలే ఉంటాయి. దేవుడు చెప్పిన ధర్మము ఏమాత్రము ప్రపంచ సంబంధము ఉండదు. బాగా చెప్పితే శరీరము బయటికి ఏమాత్రము సంబంధము ఉండదు. దేవుని ధర్మము ఏదయినా శరీరాంతర్గతముగానే, శరీర పరిధిలోనే ఉండును గానీ **శరీర పరిధి దాటినది దేవుని ధర్మమే కాదు.** దేవుని ధర్మమునకు బయటి నియమములు ఉండవు.

బయటి ధర్మము ప్రకారము హిందువులకు, క్రైస్థవులకు, ముస్లీమ్‌లకు వేరు వేరు ధర్మములు, వేరువేరు నియమములు ఉండుట వాస్తవమే. మత నియమములనే మత ధర్మములని అంటున్నారు. ఉదాహరణకు **హిందువులలో కాషాయ గుడ్డలు ధరించడము, జుట్టు, గడ్డము పెంచడము హిందూ సన్న్యాసుల నియమము. అలాగే సంస్కృతములో**

**చదువడము, ప్రార్థన చేయడము అను నియమము గలదు.** వాటిని మార్చాలనుకోవడము మతమునకు సంబంధించిన తప్పుయగును గానీ దేవునికి సంబంధించిన తప్పు కాదు. మత సంబంధమైన నియమముల ద్వారా దేవుడు తెలియడు. దేవుని జ్ఞానము తెలియదు. **ముస్లీమ్ మతములోనికి వస్తే ముఖ్యముగా నమాజ్ చేయడము, ఖురాన్ గ్రంథము చదవడము అరబ్బీ భాషలోనే జరుగవలెనను నియమము గలదు.** కొందరు అరబ్బీ దేశములో పుట్టనందున, ఇతర దేశములలో ఉండుట వలన వారున్న ఆ దేశ భాషతోనే పరిచయముండును. అరబ్బీ భాష ఏమాత్రము తెలియని దానివలన వారు పుట్టుకతో ముస్లీమ్‌లయినా, వారికి అరబ్బీ భాష రానందున తమకు వచ్చిన భాషలోనే ఖురాన్ గ్రంథమును చదువాలని అనుకోవడము ఆ మతము యొక్క నియమమును పాటించనట్లగును. అంతేకాక అరబ్బీ భాషలోనే ఆ నియమమును మార్చినట్లగును. అందువలన మత నియమములలో మార్పు చేయాలి అనుకోవడము తప్పుకాదా! యని అడుగుచున్నారు.

దీనికి నావైపు నుండి వచ్చు సమాధానము ఏమనగా! **మనిషి దేవుని జ్ఞానమును తెలియు నిమిత్తము ఏ త్యాగానికయినా సిద్ధము కావాలి.** దేవునివైపు పోవుటకు ప్రపంచ సంబంధమైన మత నియమములను అతిక్రమించినా ఫరవాలేదు. మత నియమములను మార్చినా ఫరవాలేదు. మతము ప్రపంచ సంబంధమైనప్పుడు మనిషికి దేవుని మార్గమే ముఖ్యము గానీ మతమార్గము ముఖ్యము కాదు. దైవ గ్రంథములలో సర్వమానవులు ఒక్కటేయని గలదు. దేవుడు అందరికీ ఒక్కడే. దేవుడు తన గ్రంథములో పథమును చూపాడుగానీ, మతమును చూపలేదు. మతమును, మత నియమములను మనుషులు సృష్టించుకొన్నారే తప్ప దేవుడు సృష్టించలేదు.

మతము మత్తుమందు లాంటిది. దాని బారినపడినవాడు దానికి పూర్తిగా బానిసయైపోతున్నాడు. దేవుని అధర్మములలో ఏ మతమయినా, ఏ మత ధర్మమయినా, ఏ మత నియమమయినా చేరిపోయి ఉన్నవి. పూర్వము **ద్వాపరయుగము వరకు నాలుగు అధర్మములు మాత్రమే ఉండేవి. ప్రస్తుత కలియుగములో క్రొత్తగా ఐదవ అధర్మము వచ్చి చేరినది.** పూర్వమునుండి యున్న **యజ్ఞ, దాన, వేద, తపస్సులు అధర్మములుగాయుండి** అవి మానవున్ని దేవునికి దూరముగా తీసుకొని పోయేవి. వాటిని అణచివేసి తన ధర్మములను తెలియజేసి, మానవున్ని తనవైపు వచ్చుటకు దేవుడు దైవమార్గమును ఏర్పరచాడు. అయితే నేడు క్రొత్తగా ఐదవ అధర్మము వచ్చిన దానివలన దేవుడు తన ప్రతినిధి రూపములో భగవంతునిగా భూమిమీదికి వచ్చి, **మతము అను అధర్మమును** తగ్గించవలసిన అవసరమున్నది. లేకపోతే దేవుడు చెప్పిన దైవగ్రంథములలోని విషయములను కూడా లెక్కచేయని స్థితికి మనిషిని మతము మార్చివేసినది. దేవుని (అల్లాహ్) ఆయత్‌లకే విలువ లేకుండా చేసి, ఆయత్‌లో చెప్పినమాటను వినకుండా మతము చెప్పిన మాటను వినునట్లు మనిషిని మార్చివేసినది. ఒకవైపు మా గ్రంథము అని చెప్పుచున్నా, మా గ్రంథములో ఎంతో గొప్ప జ్ఞానమున్నదని చెప్పుచున్నా, మనిషి చివరికి గ్రంథములో చెప్పిన వాక్యమును కూడా లెక్కించని స్థితికి చేరుకొన్నాడు. ఉదాహరణకు చెప్పితే ఖురాన్ గ్రంథములో 15వ సూరాయందు, 28 నుండి 31 వరకు గల వాక్యములను చూస్తే మనిషి యొక్క స్థితి నేడు ఎలాగలదో తెలుస్తుంది.

**(15-28, 29, 30, 31) "నీ ప్రభువు దేవదూతలతో ఇలా అన్న విషయము జ్ఞాపకము చేసుకో! 'నిశ్చయముగా మ్రోగేమట్టి, రూపాంతరము చెందిన జిగట బురదతో నేను**

**ఒక మానవున్ని సృష్టించబోతున్నాను. ఇక నేను అతనికి పూర్తిగా ఆకారమిచ్చి అతనిలో నా ఆత్మను ఊదినప్పుడు మీరంతా అతని ముందు సాష్టాంగ పడండి. దేవదూతలు అందరూ సాష్టాంగ పడ్డారు. ఒక్క ఇబ్లీసు మాత్రము సాష్టాంగ పడలేదు"**

దేవుడు మనిషి ఆకారమును చేసి దానిలో తన ఆత్మనే ఊది తన ప్రతినిధిని పంపినప్పుడు ఇబ్లీసు (మాయతో) కూడుకొన్న వారు మ్రొక్కలేదు.

ఇక్కడ చెప్పిన వాక్యములలో దేవుడు ధర్మసంస్థాపన కొరకు భూమిమీద మనిషి ఆకారములో వచ్చినప్పుడు దేవుడు తన ప్రతినిధిని తానే పంపినట్లు చెప్పినా వచ్చినవాడు, చెప్పినవాడు ఒక్కడేయని తెలియకుండా చేశారు. దేవుడు తెలియకుండా చేసినా తన ప్రతినిధి వచ్చినప్పుడు దేవదూతలందరూ వచ్చిన వానిని గుర్తించి సాష్టాంగ నమస్కారము చేశారు. అయితే మాయతో కూడుకొన్నవాడు మాత్రము నమస్కరించలేదు అని చెప్పాడు. అతనిని ఇబ్లీసు అంటాము అని చెప్పాడు. ఇక్కడ అసలు విషయమును చూస్తే వాక్యములో చెప్పినట్లే బయట కనపడుచున్నది. దేవుడే భూమిమీదికి మనుషుల మధ్యలోనికి వచ్చి జ్ఞానమును చెప్పి ధర్మములను తెలియజేయునప్పుడు కూడా అతను దేవుని ప్రతినిధియని తెలిసినా, అతనికి దేవదూతలందరూ నమస్కరించినా, దేవుడే స్వయముగా మీరు కూడా నమస్కరించమని చెప్పినా నేడు కొందరు నమస్కరించడము లేదు. "ఎందుకు నమస్కరించరు?" అని అడిగితే "ఇది మా మతములోని షరియత్ ప్రకారము నమస్కరించము" అని అంటున్నారు. దీనినిబట్టి ఇబ్లీస్‌తో సమానముగా వీళ్ళు కూడా చెప్పుచున్నారు.

"అంతిమ దైవగ్రంథము ఖురాన్"లో ఈ వాక్యమునకు క్రింద వ్రాసిన వివరములో ఈ విధముగా యున్నది చూడండి. **"ఇది అల్లాహ్ ఆజ్ఞ, దాన్ని పాటించడము తప్పనిసరి" అన్న విషయములో సందేహానికి లేశమైనా ఆస్కారము లేదు. అయితే "అంతిమ దైవప్రవక్త ముహమ్మద్ (స) షరియత్ ప్రకారము గౌరవార్థము కూడా ఈ రకమైన సాష్టాంగ ప్రణామం చెయ్యటము సమ్మతము కాదు"** ఈ విధముగా చెప్పియుండుట వలన దేవుని ఆజ్ఞ కూడా మత చట్టము క్రింద లెక్కించబడలేదని అర్థమగుచున్నది. చివరకు **"మతము"** అను నియమము మనిషిని ప్రక్కదారి పట్టించుచున్నదని తెలియు చున్నది. 'ఎంత స్వామి ప్రసాదమయినా ఇంత చేదా యన్నట్లు' ఏ మత నియమమయినా దేవుని ఆజ్ఞలను లెక్కచేయకున్నవి. ఇది మా మత నియమము అని చెప్పడము వింతగాయున్నది. పరలోక రాజ్యము కావాలంటే, మనము నిత్యము అనుభవించు కర్మలనుండి తప్పించు కోవాలంటే, తప్పనిసరిగా దేవుని జ్ఞానమును పాటించవలసిందే. అయితే మనిషి దేవుని ఆజ్ఞను గాలికి వదలి మా మతము, మా షరియత్ (మా నియమములు) అని అంటున్నారు. ఏదో ఒక సాకు చెప్పి చివరకు దేవుని మాటను అతిక్రమించడము జరుగుచున్నది. దేవుని ఆజ్ఞను మీరి పోవడము తప్పు అని అనుకోవడము లేదుగానీ, మత నియమములను మార్చాలను కోవడము తప్పుగా కనిపిస్తున్నది అంటే వీరి భావములో దేవుడు ఎంత గౌరవముగా యున్నాడో తెలియగలదు. పైకి చూచుటకు ఇటువంటివారు నిజమైన అల్లాహ్ భక్తులుగా కనిపించుచుండినా వీరు అల్లాహ్ భక్తులు కాదు, మతము యొక్క భక్తులేయని తెలియుచున్నది.

**27) ప్రశ్న :- దేవుని ఇష్టప్రకారముగా జీవించదలచుకొన్నారా? లేక మీ ఇష్ట ప్రకారము జీవించదలచుకొన్నారా?**

**జవాబు :-** మనిషి ఇష్టాయిష్టములు ప్రపంచ విషయములో కర్మనుబట్టి నెరవేరడము, నేరవేరకుండా పోవడము జరుగును. అందువలన మనిషి ఇష్టప్రకారము జీవించాలనుకొన్నా, అది జరుగునను నమ్మకము లేదు. అందువలన మనిషి ఇష్టాయిష్టములను చూడవలసిన పనిలేదు. ఇకపోతే దేవుని ఇష్టప్రకారము జీవించదలచుకొన్నారా? అని అడిగిన ప్రశ్నకు జవాబు చూస్తే ఈ విధముగా గలదు. దేవునికి ఒక్క జ్ఞానము తప్ప ఏదీ ఇష్టముండదు. అనగా మిగతా అన్నిటినీ ప్రపంచ ఇష్టమునకు వదలివేసి, తాను మాత్రము మనిషినుండి ఏదీ కోరడము లేదు. దేవుడు ఎక్కడో పైన ఉన్నాడని కొందరు చెప్పుచుందురు. అయితే దేవుడు ప్రతి మనిషి శరీరములో యున్నాడు. దేవుడు శరీరములో జరుగుచున్నవన్నిటిని చూస్తూ ఊరక యున్నాడు. ఈ విషయమునే ఖురాన్ గ్రంథములో సూరా 50, ఆయత్ 21లో ఇలా చెప్పియున్నారు.

**(50-21) "ప్రతి మనిషి ఒక తోలేవాడు, ఒక సాక్షిగాయుండే వారితో సహా వస్తున్నాడు"**

అని కలదు. ప్రతి జీవుడు తన వెంట పనిచేయు ఆత్మ మరియు పనిచేయక కేవలము చూస్తూయుండిన పరమాత్మతో సహా పుట్టుచున్నాడు. శరీరములో గల దేవుడు స్థబ్దతగా ఉండిపోయాడు తప్ప తన ఇష్టమును, సృష్ట్యాదిలో ప్రకటించడము తప్ప ఇప్పుడు మాత్రము ఏ ఇష్టము లేనివాడుగా యున్నాడు. మనిషికి గుణములను బట్టి ఇష్టాయిష్టములుండవచ్చునుగానీ, ఆత్మ వాని కర్మయుంటే నెరవేర్చ గలదు, కర్మ లేకపోతే నెరవేర్చదు. దేవుడు ప్రతీదీ ఆత్మకు అప్పజెప్పి ఊరకయుండిపోయాడు. అందువలన ఆయనకు ఇష్టాయిష్టములు ఉండవు.

**28) ప్రశ్న :- "యూనిటీ నిమిత్తము కనీసము ఏడు వాక్యములు అరబ్బీలో వచ్చినా సరిపోతుంది." అని అన్నారు. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** యూనిటీ కొరకు అంటే సరేయని చెప్పవచ్చుగానీ, ఏడు వాక్యముల ప్రార్థన యూనిటీ కొరకా? లేక దేవుని కొరకా? అను ప్రశ్న రాగలదు. ఇక్కడ స్వచ్ఛముగా యూనిటీ కొరకు అని యుండుట వలన అది ప్రపంచ విషయమని తెలియుచున్నది. దేవుని యొద్దకు పోవు నిమిత్తము చేయునది కాదని తెలిసినప్పుడు, వారే వారి నోటిద్వారా కేవలము యూనిటీ నిమిత్తము అని చెప్పడము వలన వారు చేయు ప్రార్థన ప్రపంచ సంబంధ మైనదేగానీ దైవికమయినది కాదని అర్థమగుచున్నది. కనిపిస్తూ యుంటే తొంగి చూడవలసిన అవసరము లేనట్లు దేవుని విషయమైతే మాట్లాడగలము గానీ, ప్రపంచ విషయమును గురించి మాట్లాడము.

యూనిటీ కొరకు ఏడు వాక్యములను సులభముగా నేర్వవచ్చును. అయితే ఆ నేర్చేది ఏదో అరబ్బీ భాషలోనే నేర్వవలెననునదే సమస్య. అరబ్బీ భాషరాని వారందరూ మా గతి ఏమి? అని సందిగ్ధములో పడిపోయారు. కొంత వయస్సు గడచిన వారు ఇప్పుడు భాష నేర్చుకొనుటకు మొదలు పెట్టితే అది వచ్చులోపల మేము చనిపోయిన ఏమీ ప్రయోజనము లేదు కదా!యని దిగులు చెంది, వారికి వచ్చిన తెలుగు భాషలోనే ఖురాన్ గ్రంథమును చదువవలెనని నిర్ణయించుకొని కొందరు ముస్లీమ్‌లు "మాకు తెలుగు ఖురాన్ ఇవ్వండి, చదివి తెలుసుకుంటాము" అని అడిగితే కొందరు ముస్లీమ్‌లు అలా మనకు వచ్చిన భాషలో చదువకూడదని అరబ్బీ భాషలోనే చదవాలని, ఇది ముస్లీమ్‌ల షరియత్‌యని చెప్పడము వలన కొందరు నిరుత్సాహపడిపోయారు. నల్గొండ జిల్లాలో దామరచర్ల మండలమున ముదిమానిక్యము అను ఒక గ్రామము గలదు. అక్కడ కొన్ని ముస్లీమ్

కుటుంబములు గలవు. వారికి తెలుగు మాత్రము వచ్చును. అరబ్బీ భాష అంటే ఏమిటో కూడా వారికి తెలియదు. అక్కడ దాదాపు నలభైమంది ముస్లీమ్‌లు గలరు. వారు తెలుగులో వ్రాయబడిన ఖురాన్ కొరకు చాలామందిని అడిగారు. అయితే తెలుగు ఖురాన్‌లు యున్నా వారు ముస్లీమ్‌లు అయిన దానివలన వారికి తెలుగు ఖురాన్ గ్రంథములను ఎవరూ వారికి ఇవ్వలేదు. అరబ్బీ భాషలో గల ఖురాన్‌ను ఇస్తామన్నారు. రెండు మూడు బలవంతముగా ఇచ్చారు. దానివలన ఏ ప్రయోజనము లేదు. అరబ్బీ భాష రాని దానివలన వారు వాటిని చదువలేదు. చివరకు మమ్ములను తెలుగు ఖురాన్ గ్రంథములు కావాలని అడిగారు. ఖురాన్ చదవాలను వారి శ్రద్ధకు మాకు సంతోషము కల్గి మా వద్ద కొన్ని ఆయత్‌లకు మాత్రమే వివరముగల **"అంతిమ దైవగ్రంథములో జ్ఞాన వాక్యములు"** అను 700 పేజీల గ్రంథమును ఉచితముగా ఇవ్వదలచి నలభై గ్రంథములను ఆ ఊరికి పంపడమైనది. అక్కడికి పోయిన తర్వాత ఒక ముస్లీమ్ నాయకుడు వచ్చి ముస్లీమ్‌లు తెలుగు ఖురాన్ చదువకూడదని వారికి గ్రంథములను ఇవ్వకుండా ఆటంకపరిచాడు. "మేము ఉచితముగా ఇచ్చేదానికి వచ్చాము. మీకు ఇష్టముంటే తీసుకోండి లేకపోతే లేదు" అని చెప్పాము. అప్పుడు కొందరు దొంగచాటుగా ఆరు గ్రంథములు తీసుకొన్నారు. 'ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ' అధ్యక్షుడు అమీర్ అలీ, అతనికి తోడు మరొక వ్యక్తి హైదరాబాద్‌నుండి అక్కడికిపోయి ఆరు గ్రంథములు మాత్రము ఇచ్చి తిరిగి వచ్చారు.

యూనిటీ కొరకు అరబ్బీ భాష అను నినాదము వలన, ఖురాన్‌ను అరబ్బీలో చదవాలియని అనుటవలన, భాషరాని వారికి ఖురాన్ జ్ఞానమే తెలియకుండా పోవుచున్నది కదా! నల్గొండ జిల్లాలో ఒక గ్రామము పరిస్థితి

అలాగే అయింది కదా! వారికి భాష రాదు. భాషను నేర్పేవాళ్ళు అక్కడ లేరు. ఒకవేళ అక్కడ అరబ్బీ భాషను నేర్పేవారున్నా వారు నిత్యము కూలి పనులకు పోయేవారు, నేర్చుకోవడానికి సమయము లేదు. చివరికి భాష ఆటంకమును అతిక్రమించి తెలుగులో చదువుటకు మత నియమములు అడ్డము రావడము వలన ఒక గ్రామములో ఖురాన్ జ్ఞానమే తెలియకుండా పోయినది. ఆహార నియమములను గురించి సూరా 5, ఆయత్ 3లో ఫలానా ఆహారము తినకూడదని చెప్పడము జరిగినది. ఆహారమును గురించిన సంపూర్ణమైన ధర్మమును బోధించానని అక్కడ వాక్యములో దేవుడు చెప్పాడు. అయితే చివరిలో ఏ ఆహారము దొరకనప్పుడు, ఏ గత్యంతరము లేనప్పుడు ఆకలితో ఇబ్బంది పడుటకంటే నిషేధిత ఆహారమును తినినా ఫరవాలేదు, నేను క్షమిస్తాను అని దేవుడే కొంత అవకాశము ఇచ్చినప్పుడు, ఒక తెలుగు భాష తప్ప ఇతర భాష ఏదీ తెలియనప్పుడు, జ్ఞానమును తెలియుటకు అరబ్బీ భాషను నేర్చుకొనుటకు అవకాశము లేనప్పుడు, జ్ఞానము వేరు విధముగా తెలియు గత్యంతరము లేనప్పుడు, ఖురాన్‌ను ఇతర భాషలలోనయినా తెలియవచ్చునని దేవుడు చెప్పియుండడా? అని అనుమానము రాకతప్పదు. ఆకలికొన్నప్పుడు, వేరే ఆహారము దొరకనప్పుడు ఆకలితో చచ్చుటకంటే పందిమాంసమును తినియైనా ఆకలి తీర్చుకోవచ్చుని, అలా గత్యంతరము లేక చేసిన పాపమును అల్లాహ్ క్షమిస్తాడనీ (5-3) లో యున్నప్పుడు ఏ అవకాశము లేనప్పుడు తెలుగులోనయినా చదవవచ్చునని ఎందుకు చెప్పియుండకూడదు? అని చూస్తే, అంతిమ దైవ గ్రంథమయిన ఖురాన్ గ్రంథములో ఎక్కడగానీ అరబ్బీ భాషలోనే గ్రంథమును చదువవలెననిగానీ, ప్రార్థన అరబ్బీ భాషలోనే చేయవలెననిగానీ లేదు. ఆహార విషయములో (5-3) లో నిషేధిత ఆహారమును చెప్పిన దేవుడే

వీలులేనప్పుడు తినినా క్షమిస్తానని చెప్పి యుండగా, ఎక్కడగానీ ఇతర భాషలో చదవడము నిషేధితమని చెప్పనప్పుడు ఇతర భాషలో చదివినా అది తప్పు కాదు, అది క్షమించేదే కదా!

కొందరు మేము మత పెద్దలమనో, మతములో జ్ఞానులమనో, గురువులమనో ఏదో ఒక పెద్దరికమును ప్రదర్శించుచూ అమాయక ముస్లీమ్‌లను తమ కిష్టమైనట్లు ఆడించుచున్నారు. తమ చెప్పు చేతులలో పెట్టుకొంటున్నారు. చాలామంది వారి మాటలను వింటున్నారు. దానివలన దేవుని జ్ఞానమునకు దగ్గరయ్యేది పోయి దూరమగుటకు అవకాశము గలదు. అందువలన అటువంటి వారి మాటలను నమ్మవద్దని, ఖురాన్‌లోని జ్ఞానమును మాత్రము తెలియమని దేవుడు మనుషులకు చెప్పుచూ సూరా 5, ఆయత్ 48లో ఇలా చెప్పాడు చూడండి.

**(5-48) "మేము నీ వైపునకు ఈ ఖురాన్ గ్రంథమును సత్యసమేతముగా అవతరింపజేశాము. ఇది తమకన్నా ముందు వచ్చిన గ్రంథాలను సత్యమని ధృవీకరిస్తుంది. నీ వద్దకు వచ్చిన సత్యమును వీడి వారి మనోవాంఛలను అనుసరించకు."**

ఈ వాక్యములో చివరిగా "నీ వద్దకు వచ్చిన సత్యమును వీడి వారి మనోవాంఛలను అనుసరించకు" అని గలదు కదా! ఇక్కడ బాగా వివరముగా చూచుకోగలిగితే నీకు సత్యముతో కూడుకొన్న జ్ఞానమును ఇచ్చాను. నీవు ఇతరుల మాటలు విని వారి మనోభావముల ప్రకారము నడుచుకోవద్దు. నా భావమును అనుసరించి ఖురాన్ జ్ఞానమును నీవు ఏ భాషలో అయినా తెలుసుకో, అయితే నేను చెప్పని విషయమును రేకెత్తించి

గ్రంథమును అరబ్బీలోనే చదువవలెనని చెప్పే వారి మాటలు వినవద్దు. వారి మనోవాంఛలకు జ్ఞానమునకు సంబంధము లేదు. నేను భాషను గురించి ఎక్కడా చెప్పకున్నా, వారి సొంత తెలివిని ఉపయోగించి చెప్పుమాటలను వినవద్దండి. అని చెప్పుచూ "వారి మనోవాంఛలను అనుసరించకు" అని అన్నాడు. అల్లాహ్ తన గ్రంథములో ఎక్కడా భాషను గురించిన ప్రస్తావనయే తేలేదు. దేవునికి భాషలతో సంబంధము లేదు, భావముతోనే సంబంధమని ముందే చెప్పాము. భూమిమీద పుట్టిన అండజ, పిండజ, ఉద్భిజములకే భాష అవసరము. పాలింపబడు జీవరాసులలో గల మనుషులకు కూడా భాష అవసరమే. అందువలన మనిషికి పుట్టుకతో ఒక భాషరాగా, ఓపిక యుంటే మరొకటి లేక రెండు, మూడు నేర్వగలుగు చున్నాడు. చాలామంది ఒక భాషతోనే బ్రతుకుచున్నారు. అటువంటి వారందరికీ దేవుడు వారికి తెలిసిన భాషలోనే జ్ఞానమును తెలియుటకు తాను బోధకులను, ప్రవక్తలను ఆ ప్రాంత భాషలో మాట్లాడు వారినే పంపాము అన్నాడు. అటువంటప్పుడు అరబ్బీ భాషయని కొందరు చెప్పుచున్నారంటే అది వారి ఆధిపత్యమును ప్రదర్శించుకొనుటకేయని చెప్పవచ్చును. అటువంటి వారి మాటలను అనుసరించవద్దండని (5-48) లో దేవుడు చెప్పాడు కదా!

**29) ప్రశ్న :- ఎవరయినా, వారి మాటను కాదు అంటే వారిని నాస్తికులు అని, హేతువాదులని, అజ్ఞాన కోవకు చెందినవారని అంటారు. రేపు మీ జవాబును చూచిన తర్వాత మిమ్ములను నాస్తికులని అనినా ఆశ్చర్యము లేదు. ఆయన నాస్తికులన్నా, హేతువాదులన్నా మీరు దానికి జవాబు ఏమని చెప్పగలరు?**

**జవాబు :-** "కొట్టేదానికి రానప్పుడు కొరికేదానికి మొదలు పెట్టాడట" అను సామెత ప్రకారము కొందరు సరైన జవాబు చెప్పలేనప్పుడు ఎదుటి వారిని ఏదో ఒకటి మాట్లాడి తనను నెగ్గించుకోవడానికి ఇతరులను నాస్తికులనో, హేతువాదులనో అని చెప్పుచుంటారు. ఇంకా కొందరు నేను సాతాను పార్టీలో యున్నానని, దేవునికి వ్యతిరేఖముగా మాట్లాడు చున్నానని కూడా చెప్పుచుందురు. ఎవరు ఏమి చెప్పినా నేను చెప్పునదేదో ప్రజలు గమనిస్తూ యుండడము వలన మరియు దేవుడు ప్రతిమాటను గమనిస్తూయుండడము వలన ఇరువురికి నన్ను గురించి తెలియుచున్నది. అటువంటప్పుడు ఎవరో నన్ను నాస్తికుడు, హేతువాది అనడములో నాకు ఏమీ నష్టము లేదు. నేను నాస్తికున్ని కానని నా రచనలు చదివినవారికి తెలియును.

నన్ను గురించి నేను చెప్పాలంటే, దేవుని జ్ఞాన విషయములలో అది ఏ మతములో ఉన్నదయినా గానీ, తప్పు భావము చెప్పునప్పుడు, అది సరియైన పద్ధతి కాదనీ, దేవుని జ్ఞానమును సరైన భావముతో తెలియాలని వాదించుచుందును. అందువలన జ్ఞానములో కారణము లేకుండా ఏదీ ఉండదనీ, హేతువుని గురించి ప్రశ్నించుచుందును. అందువలన నన్ను జ్ఞానమార్గములో హేతువాదని అనుచుందురు. ఎవరు ఏమనినా నేను దానిని పట్టించుకోను. నా ముందరే దేవుని వాక్యములకు తప్పు అర్థమును చెప్పితే దానిని తప్పని చెప్పకుండా ఉండలేను. దేవుని గ్రంథములకు దేవుని జ్ఞానమునకు విలువ ఇస్తాను గానీ మనుషుల జ్ఞానమునకు విలువనివ్వను. కొందరు తాము దేవుని విషయములో తప్పు చేస్తూ ఇతరులను తప్పులెంచుచుందురు. మనిషికి నచ్చిన నిర్ణయాలు దైవ ధర్మములనుకోవడము తప్పుకదా!యని ఇతరుల తప్పులను చూపుచున్న

కొందరు తామే గ్రంథములో వ్రాయని, దేవుడు చెప్పని విషయములను తెచ్చి ధర్మములని అంటున్నారు. భాష విషయములో దేవుడు చెప్పని నిర్ణయాలను తెచ్చి అవే ముఖ్యమైన ధర్మములని చెప్పు తమ పని తప్పు కదా!యని యోచించడము లేదు. తానుచేయు పనినే ఇతరులు చేస్తే తప్పని చెప్పువారిని ఎవరూ ప్రశ్నించకున్నా, మేము ప్రశ్నించి దేవుని మార్గము అందరికీ సులువుగా ఉండునట్లు చేయాలనునదే మా ఉద్దేశ్యము. ఈ విషయములో మమ్ములను కొందరు దూషించినా ఓర్చుకొని వారికే జ్ఞానము యొక్క విలువను తెల్పుచున్నాము.

**30) ప్రశ్న :- తన మనస్సును దేవునిగా చేసుకొన్నవారు దేవుని ప్రవక్తలను అనుసరించలేదు. మనస్సును కళ్లెము లేని గుర్రముగా, చుక్కాని లేని నావగా వదలి వేయకూడదు అని అంటున్నారు. దానికి మీ సమాధానము ఏమి?**

**జవాబు :-** సర్వసాధారణముగా అందరూ చెప్పే మాటలే ఇవి. మనస్సును గురించి లోతుగా తెలుసుకొని మాట్లాడడము లేదు. మనస్సు అనే పేరు విన్నవారేగానీ దాని ఆకారము ఎలా ఉంటుందో, దాని పనియేమిటో? దాని విషయము సంపూర్ణముగా తెలిసినవారు బహుశా ఎవరూ ఉండరు. వాస్తవముగా మనస్సును గురించి తెలుసుకోగలిగితే దానిని బంధించాలని ఎవరూ అనుకోరు. దానిని (మనస్సును) బంధించాలి, విచ్ఛలవిడిగా వదలకూడదు అని అంటే, అనేవారికి మనస్సును గురించి పూర్తి తెలియదని అర్థమగుచున్నది. శరీరములోని మనస్సును తెలియుటకు ముందు బుద్ధిని గురించి తెలియాలి. బుద్ధి చేయుచున్న పనిని గురించి, దాని ఆకారమును గురించి తెలిసినప్పుడు మనస్సును గురించి తెలియనగును. బుద్ధి విషయము తెలియనిదే మనస్సును గురించి తెలియలేరు. బుద్ధి, మనస్సు

ఒకదానికొకటి అవినాభావ సంబంధము కల్గియున్నవి. బుద్ధి పనిచేస్తే మనస్సు పని చేయును. అట్లే మనస్సు పనిచేస్తే బుద్ధి పనిచేయును. బుద్ధి, మనస్సు శరీర అంతరంగములో ముఖ్యమైన రెండు భాగములు సూక్ష్మమైనవి, రెండూ కంటికి కనిపించునవి కావు. బుద్ధి మనస్సు రెండు శరీరములో గల జీవునికి లోబడి లేవు. జీవుని ఆజ్ఞను ఏమాత్రము రెండూ లెక్కించవు. అందువలన వాటి విషయము తెలిసిన జ్ఞాని, వాటిని కళ్లెము వేసిన గుఱ్ఱములాగా ఆధీనములోనికి తెచ్చుకోలేడు. జ్ఞాని అయినవాడు అటువంటి పనిని చేయడు. మనస్సు, బుద్ధి, చిత్తము, అహము అనునవి యున్నా, అవి జీవుని ఆధీనములో ఏమాత్రము లేవు. నాలుగు అంతఃకరణములు శరీరములో జీవుని తర్వాత ముఖ్యమైన భాగములుగా యున్నవి. ఈ నాలుగును ఆత్మ తన ఆధీనములో యుంచుకొని శరీరములోని కర్మనుబట్టి వాటిని ఆడించుచుండును. దీనిప్రకారము మనస్సు, బుద్ధి, చిత్తము, అహము అను నాలుగు కర్మానుసారము ఆత్మ చేత నడిపింపబడుచున్నవనీ, జీవుని ప్రమేయము లేకుండా ఉండు మనస్సును జీవుడు ఏ విధముగా కూడా శాసించి నడుపలేడనీ, తన ఆధీనములో ఉంచుకోలేడనీ తెలియుచున్నది.

**31) ప్రశ్న :- నమాజ్ అరబ్బీ భాషలోనే చేయాలి. అట్లు చేయకపోతే వారు ముస్లీమ్‌యని చెప్పుకొన్నా, వారు చేయునది ప్రార్థనగా గుర్తించ బడదు అని అంటున్నారు. నమాజ్‌ను ఇతర భాషలలో చేయకూడదా? అరబ్బీ భాషలోనే చేయాలా? దీనికి మీ జవాబు చెప్పండి?**

**జవాబు :-** నమాజ్ అంటే చావుపుట్టుకలు లేని పరలోకము కావాలని అర్థించడమును ప్రార్థన (నమాజ్) అని చెప్పవచ్చును. నమాజ్ అను పదము వాస్తవముగా తెలుగు పదముగా యున్నది. 'నమాజ్' అను

పదములోని అర్థము ప్రకారము ప్రార్థన చేయు మనిషి చనిపోయిన తర్వాత తిరిగి పుట్టకుండా దేవునిలోనికి ఐక్యమై పోవాలనునదే ముఖ్య ఉద్దేశ్యముగా యున్నది. దేవుని ప్రార్థనలో **'దేవుడు మనిషి భావమును చూచునుగానీ మనిషి భాషను చూడడు'** అని ముందే చెప్పుకొన్నాము. దేవుని సృష్ఠిలో పాలించబడువారు, పాలించేవారు రెండు రకములు గలరు. ఈ రెండు జాతులను సృష్ఠించినవాడు దేవుడు, నడిపించువాడు ఆత్మగా యున్నారు. ఇందులో పాలించబడు వారికే భాషలు ఉపయోగపడుచున్నవి. పాలించు వారు భాషలోని భావమును గ్రహించుచున్నారు. ఏ భాషలోనయినా మాట్లాడుచున్నారు. ఇద్దరినీ సృష్ఠించిన దేవుడు, ఇద్దరినీ నడిపించు ఆత్మ భాషతో సంబంధము లేకుండా మనిషి శరీరములోని భావమును నేరుగా గ్రహించుచున్నారు. అందువలన దేవునిపట్ల చేయు ప్రార్థన ఏ భాషలో యున్నా దేవుడు భాషతో పని లేకుండా మనిషి హృదయాంతరాళము లోని భావమును గ్రహించుచున్నాడు. దీనినిబట్టి ఏ ప్రార్థననయినా, ఏ భాషలోనయినా చేయవచ్చును. మూడు దైవగ్రంథములలో కూడా ప్రార్థన ఫలానా భాషలోనే చేయాలని ఎక్కడా వ్రాయలేదు.

దేవుడు చెప్పని విషయములో స్వంత నిర్ణయాలు తీసుకొని, ఫలానా భాషలోనే ప్రార్థన చేయాలని తమ స్వంత భావమును చెప్పువారు, ఇతరులకు 'మీకు ఇష్టమొచ్చిన స్వంత నిర్ణయాలు తీసుకోవడము తప్పు' అని చెప్పడము 'గురుగింజ' నీతిలాగ యున్నది. అదేమాటను త్రిప్పి అడిగితే దేవుడు చెప్పకున్నా మీరు స్వయముగా ప్రార్థనను సృష్ఠించి, ప్రార్థనను అరబ్బీ భాషలోనే చేయాలని కొందరు, సంస్కృతములోనే చేయాలని కొందరు అనడము ఆశ్చర్యముగా యున్నది. అట్లు ఒక భాషలో చేయు ప్రార్థనను భాషకు కట్టుబడిన ప్రార్థనయని చెప్పవచ్చును. అటువంటి ప్రార్థనలు

దేవునికి ఇష్టముండదు. మనిషిలో భావము **'దేవుని మీద విధేయతకల్గి ప్రపంచ సంబంధ ఆశలు లేకుండా, దైవములోనికి చేరిపోవాలని చేయు ప్రార్థన నిజమైన ప్రార్థన'** అని అంటాము. నియమాలతో చేయు ప్రార్థనను దేవుడు ఒప్పుకోడు. అలా చేయమని ఎక్కడా చెప్పనిదే మనిషి స్వంత నిర్ణయాలు ఎందుకు తీసుకోవాలి? తాము స్వంత నిర్ణయాలు తీసుకొనుచూ ఇతరులకు నీతి చెప్పడము దేనికి? దేవున్ని మనుషుల స్థాయికి తగ్గించి ఫలానా భాషనే దేవుడు ఇష్టపడుతాడని ఎందుకు చెప్పాలి? ఖురాన్ అరబ్బీలో వ్రాసిన దానివలన దేవునికి అరబ్బీ భాష ముఖ్యమైనదని చెప్పగలిగితే, ఖురాన్ తనకంటే ముందు వచ్చిన రెండు దైవగ్రంథములను సత్యమని ధృవీకరించుచున్నది కదా! అందులో కూడా జ్ఞానజ్యోతి యున్నదని చెప్పియున్నది కదా! ముందు వచ్చిన రెండు గ్రంథములు కూడా దైవ గ్రంథములే కదా! అటువంటప్పుడు భగవద్గీతను వ్రాసిన సంస్కృత భాష దేవుని లెక్కలో గొప్పగా యుండవలెను కదా! భగవద్గీతలో కూడా తనకు సంస్కృత భాష ముఖ్యమని దేవుడు చెప్పలేదు కదా! ఖురాన్‌ను వ్రాసిన అరబ్బీ భాష దేవునికి ముఖ్యమైనదైతే, ముందు వచ్చిన భగవద్గీత వ్రాయబడిన సంస్కృతము కూడా దేవునికి ముఖ్యమైనదేయని చెప్పవచ్చును. ఎవరో అజ్ఞానము చేత ఈ భాష దేవునికి ముఖ్యమని చెప్పితే, అందరూ ఆలోచించకుండా అదే చెప్పడము మనుషులకు అలవాటైపోయినది. దేవునికి భాష ముఖ్యము కాదు, భావము ముఖ్యమని చివరిగా తెల్పుచున్నాము.

**32) ప్రశ్న :- వ్యక్తిగతముగా తోటి మనిషిని చంపడము తప్పుయగును. చట్టప్రకారము మనిషిని చంపడము తప్పుకాదు అని అంటున్నారు. మీరు ఈ విషయములో ఏమంటారు?**

**జవాబు :-** మనము ఇప్పుడు మాట్లాడుచున్నది ప్రపంచ సంబంధ

విషయములనా లేక ఆధ్యాత్మిక సంబంధ విషయములనా అని చూచుకొంటే దైవ సంబంధ ఆధ్యాత్మిక జ్ఞాన విషయములను గురించి మాట్లాడుచున్నాము. అందువలన ఒక మనిషిని చంపు విషయములో ప్రపంచ సంబంధముగా కాకుండా దైవ సంబంధముగనే మాట్లాడుకోవాలి. అందువలన బయట ప్రపంచములో వ్యక్తిగతముగా ఒక మనిషిని హత్య చేస్తే అందులోని హత్యా పాపము చంపినవానికే చేరును. ప్రపంచ సంబంధముగా బయట చట్టముల ప్రకారము మనిషి శిక్షనుండి తప్పించుకోవచ్చును. అయితే మనిషి పాపమునుండి తప్పించుకోలేడు. తర్వాత పాపము యొక్క అనుభవము నుండి తప్పించుకోలేడు. బయట చట్టములో గల లొసుగుల వలన శిక్షనుండి తప్పించుకొను అవకాశము గలదు. ఆధ్యాత్మికమునకు సంబంధించినంత వరకు మనిషి చేయు పనినిబట్టి, వానిలోని భావమును బట్టి మనిషికి పాపపుణ్యములు సంభవించుచుండును. వచ్చిన పాప పుణ్యములను మనిషి అనుభవించవలసిందే. మనిషి ఒక పనిని చేస్తే ఆ పనిని చేయించినవాడు ఆత్మయే. జీవాత్మకు, జరిగెడి పనులకు సంబంధము ఏమాత్రము లేదు. అయినా జీవుడు అలా తనకు సంబంధము లేదు అని అనుకోవడము లేదు. తన భావములో తానే ప్రతి పనిని చేయుచున్నానని అనుకోవడము వలన ఆయా కార్యములలోని కర్మలు (పాపపుణ్యములు) మనిషిని అంటుకొనుచున్నవి. చేయని పనిని చేశానని భావమును పొందడము వలన అతనినే కర్మలు (పాపము) చేరుచున్నవి. శరీరములో భాగముగా యున్న అహము చెప్పిన భావమును జీవుడు విని హత్యను నేనే చేశానని అంతరంగ భావమున అనుకోవడము వలన భావమును బట్టి కర్మరాగా, కర్మనుబట్టి శిక్ష కష్టాలు, దుఃఖముల రూపములో వచ్చును. బయట చట్టమునకు శిక్ష పడకుండా తప్పించుకొనినా, లోపలి దేవుని

విధానమునకు తప్పక శిక్షపడును. ఎవరూ తప్పించుకొనుటకు వీలులేదు. బయట చట్టము ప్రకారము ఒక సైనికుడు ఒక దేశద్రోహిని చంపడము నేరము కాదు, శిక్ష లేదు. అయినా లోపలి విధానము ప్రకారము నీవు చంపాను అనుకొనుచున్నావు కావున పాపము తప్పదు, శిక్ష తప్పదు. దైవజ్ఞానము తెలిసినవాడు ఎల్లప్పుడు లోపలి విధానమునకు భయపడి చెడు భావమును పొందడు. దేవునికి భావమే ముఖ్యము కావున హత్యను చేయకున్నా హత్య చేసినట్లు భావమును పొందినా భావము ప్రకారము పాపము వచ్చును, దాని ప్రకారము శిక్ష వచ్చును. అందువలన బైబిలు గ్రంథములో ఒక స్త్రీని మోహపు చూపుతో (కామము చూపుతో) చూచినట్లయితే వాడు బాహ్యముగా వ్యభిచారము చేయకున్ననూ, అంతరంగ భావమునుబట్టి వాడు వ్యభిచారము చేసినట్లేయని మత్తయి సువార్త 5వ అధ్యాయములో 28వ వచనములో కలదు. **(మత్తయి 5-28) *"ఒక స్త్రీని మోహపు చూపుతో చూచు ప్రతివాడు అప్పుడే తన హృదయ మందు ఆమెతో వ్యభిచారము చేసినవాడగును."***

దేవుని విధానములో అంతా మాటలనుబట్టి, చేతలనుబట్టి ఏమాత్రము ప్రాధాన్యత లేదు. కేవలము భావమునుబట్టి మాత్రమేయని మేము చెప్పినట్లు, అనేకచోట్ల చెప్పియున్నారు. వాస్తవముగా జీవుడు ఏమీ చేతకానివాడు, జీవుడు ఏమీ చేయలేడు. శరీరములోని ఆత్మయే అన్ని కార్యములను అవయవముల చేత చేయించుచున్నది. ఆత్మ శక్తినిచ్చి కర్మేంద్రియముల చేత, జ్ఞానేంద్రియముల చేత పనులు చేయించుచుండగా జీవుడు అహము అను భావమును పొంది, తనకు సంబంధము లేని కార్యములన్నిటినీ తానే చేశానని చెప్పుచున్నాడు. అలా చెప్పుట వలన జీవునికి సంబంధము లేని పాపము వచ్చి చేరుచున్నది. ఉదాహరణకు

చెప్పితే వాస్తవముగా జీవుడు ఏమీ చేయలేనివాడు అన్నట్లు ఏమీ చూడలేని వాడుగా యున్నాడు. జీవునికి స్వయముగా దృష్టి లేదు. కావున అతనిని గ్రుడ్డివానిగా చెప్పవచ్చును. గ్రుడ్డివాడు ఏమీ చూడకున్నా తాను చూచాను అని చెప్పడము వలన గ్రుడ్డివాడైన జీవునకు పాపము వచ్చుచున్నది. ఈ విధముగా భావమునుబట్టి పాపము, పుణ్యము రెండూ వస్తున్నవి. ఈ కర్మలతో మళ్ళీ జన్మలు, కర్మలు వచ్చుచున్నవి. ఈ విషయమై ఉదాహరణకు యోహాన్ సువార్తలో 9వ అధ్యాయమున 41వ వాక్యమును చూడండి. **(యోహాన్ 9-41) "మీరు గ్రుడ్డివారైతే మీకు పాపము లేకపోవును గాని, చూచుచున్నామని మీరిప్పుడు చెప్పుచున్నారు గనుక మీ పాపము నిలిచియున్నదని చెప్పెను."**

ఇక్కడ జీవుడు గ్రుడ్డివాడైయుండి చూచుచున్నానని భావించి చెప్పడము వలన వానికి పాపము వస్తున్నదని చెప్పడమైనది. ఇదంతయూ భావము వలననే పాపపుణ్యములు వచ్చుచున్నవి. అందువలన వ్యక్తిగతముగా ఒక మనిషిని చంపినా, చట్టము ప్రకారము చంపినా నేను చేశాను, నేను చంపాను అను భావముచేత వానికి హత్యాపాపము అంటుకొనుచున్నది. ఈ విధముగా చూస్తే పాపపుణ్యములు, బయటి చట్టమును బట్టి లేవుగానీ లోపలి దేవుని విధానమునుబట్టి గలవు. అందువలన అంతరంగమున గల శిక్షనుండి ఎవరూ తప్పించుకోలేరు.

**33) వ్యక్తిగతముగా ప్రార్థన మాతృభాషలో చేసుకోవడము తప్పు కాదు. ఇస్లామ్ చట్టప్రకారము ప్రార్థన చేయకపోవడము తప్పు అని వారు అంటున్నారు. దీనికి సమాధానము చెప్పండి?**

**జవాబు :–** "ఇస్లామ్ చట్టము ప్రకారము ప్రార్థన చేయకపోవడము తప్పు"

అనునదే ఇక్కడ ముఖ్యమైన సారాంశ వాక్యముగా యున్నది. దేవునికి ధర్మములు ఉన్నాయి. ధర్మముల ప్రకారము దేవుని జ్ఞానము ఉన్నది. దేవుని విధానములో ఒక చట్టము కలదని ఎక్కడా చెప్పలేదు. దేవుని విధానమును తెలియుటకు శాస్త్రము కలదు. అదే ఆరు శాస్త్రములలో పెద్ద శాస్త్రమయిన బ్రహ్మవిద్యా శాస్త్రము. దేవుని విధానము తెల్పు శాస్త్రములో శాసనములు ఉంటాయి. వాటినే ధర్మములు అని అంటాము. చట్టము ప్రపంచ సంబంధమైనది. శాస్త్రము దైవ సంబంధమైనది. దేవుని విధానములో చట్టములు పని చేయవు. వాటికి విలువ ఉండదు. దేవుని ప్రార్థన విషయములో ఇస్లామ్ చట్టము ఒక రకము చెప్పితే, హిందూ చట్టము ఒక రకము చెప్పుచున్నది. ఇస్లామ్ చట్టము అరబ్బీ భాషలోనే ప్రార్థన చేయవలెననీ, దినమునకు ఐదు పూటలు నమాజ్ చేయవలెనని చెప్పగా, హిందువుల చట్టము ప్రకారము ప్రార్థన సంస్కృత భాషలోనే చేయాలి. ఫలానా వస్తువులు పూజాద్రవ్యములుగా పెట్టవలెనని చట్ట నియమము గలదు. ఈ విధముగా ఒక్కో మతమునకు ఒక్కొక్క చట్టము, ఆ చట్టములో నియమములు ఉండును. మతములే దేవుడు కల్పించనప్పుడు, మనుషులు ఏర్పరచుకొన్నవే మతములు, మత చట్టములు అనునవి ఉన్నప్పుడు మనుషుల చేత తయారు చేయబడిన మతమునుగానీ, మత చట్టమునుగానీ దేవుడు ఎందుకు ఒప్పుకొనును? దేవుడు తాను ప్రకటించిన విధానము ప్రకారమే ఉండునుగానీ, ఇతరులు చెప్పిన చట్టము ప్రకారము ఉండుటకు అతను రాజ్యాంగములోని పౌరుడు కాడు కదా! దేవుడు తన విధానమును గురించి, తన ధర్మములను గురించి తన గ్రంథములలో చెప్పియున్నాడు. ప్రార్థన విషయమునకు వస్తే దేవున్ని భావముతోనే ఆరాధించవలెనని ఉందిగానీ భాషతో ఆరాధించవలెనని ఎక్కడా వ్రాసియుంచలేదు. ప్రథమ దైవగ్రంథము భగవద్గీతలోగానీ, మధ్యమ,

అంతిమ దైవగ్రంథములోగానీ, తనను ఆరాధించు విధానమును చెప్పాడు. అయితే ఆ పద్ధతిని మనుషులు తెలియ లేకపోయారు. మూడు దైవ గ్రంథములలోనూ మూడు యోగములను చెప్పియున్నా, వాటి విధానము కొద్దిగ కూడా తెలియకుండా పోయినది. ఒక గ్రంథములో చెప్పిన విధానమే మరియొక గ్రంథములో చెప్పియున్నా, భాషలో కొంత తేడా యుండుట వలన భావము ఒక్కటే అయినా, దానిని మనుషులు సరిగా అర్థము చేసుకోలేకపోయారని చెప్పవచ్చును.

ఉదాహరణకు చెప్పితే భగవద్గీతలో ఎవని భావములో అహంకారము లేదో అతడు ఇతరులను చంపినా, వాడు చంపనట్లేయగును. అతనిని హంతకుడు అనకూడదు. వానికి హత్యాపాపము రాదు అని భగవద్గీత మోక్షసన్న్యాస యోగమున 17వ శ్లోకమున చెప్పియున్నారు. ఇది కర్మయోగమునకు సంబంధించిన శ్లోకము. అదే విషయమునే, అదే కర్మయోగమునే బైబిలులో చెప్పినప్పుడు భాషను మార్చి చెప్పియుండుట వలన ఇది గీతలో చెప్పిన విషయమేనని ఎవరూ గుర్తుపట్టలేదు.

**(మత్తయి 5-28) "ఒక స్త్రీని మోహపు చూపుతో చూచు ప్రతివాడు అప్పుడే తన హృదయమందు ఆమెతో వ్యభిచారము చేసినవాడగును."**

ఇక్కడి వాక్యమునకు గీతలోని వాక్యమునకు ఏమాత్రము సంబంధము లేనట్లు కనిపించుచుండినా, రెండు ఒకే భావమును కల్గియున్న వాక్యములే. రెండు వాక్యములయందు భాష తేడాయున్నా భావము ఒక్కటే గలదు. ఈ కర్మయోగ విధానము తెలియనివాడు బయట చట్టము ప్రకారము హత్య చేసినా, వానికి కర్మ తప్పదు, శిక్ష తప్పదు.

**34) ప్రశ్న :- "మీరు ముస్లీమ్ అయి ఇస్లామ్ ఒప్పుకున్నప్పుడే ఆ చట్టము మీకు వర్తిస్తుంది. మత సంబంధ విషయములో మీరున్నట్లే" అని వారు అంటున్నారు. నాకు తెలియకుండానే పుట్టుకలోనే ముస్లీమ్ కుటుంబములో పుట్టాను. పెద్దయిన తర్వాత నేను ఒక ముస్లీమ్ యని తెలిసింది. అయితే నాలో 'మతము' అనునది మనుషులను ఐకమత్యముగా లేకుండా చీల్చి చిచ్చుపెట్టేదానికి ఉంది, దేవున్ని తెలియుటకు మతముతో పనిలేదు అని అనుకొనెడివాడిని. దేవుడు ఏ నియమము లేనివాడు అయినందున నియమాలతో నిండియున్న మతము వలన దేవుడు తెలియబడడు అని నేను అనుకొనేవాడిని. నేను ఇస్లామ్ మతములో పుట్టినా నాకు మత వ్యవస్థ మీదనే నమ్మకము పోయినది. దీనికి కారణము బయట జరుగు మతకలహాలే. నా మనో భావములు వేరు, నా మత భావములు వేరు, అడకత్తెరలో వక్కవలె మధ్యలో ఇరుక్కున్నాను. ఇప్పుడు నేను ఏమి చేయాలి?**

**జవాబు :-** నీవలె ఎవరూ బయటికి చెప్పుకోలేదుగానీ, నీవున్నట్లు భూమిమీద చాలామంది యున్నారు. పుట్టుకతో 'మతము' అను బంక (జిగట) అంటుకోగా అది మనిషి స్వాతంత్ర్యమును హరించి వేస్తుంది. మతము ప్రతి ఒక్కరిని తనకు బానిసగా ఉండులాగున చేసుకుంది. మత బానిసలైన వారు కొందరు మేధావులున్నా వారు మతము వలన విచక్షణ కోల్పోయి తమ మేథాశక్తిని విధ్వంసమువైపు త్రిప్పుచున్నారు. నేనేమి చేయుచున్నాను అను విచక్షణ కోల్పోయి పరమతములను లేకుండా చేయవలెనని దానికి కావలసిన విధ్వంసక చర్యలను చేయపూనుచున్నారు. ఇది ఆ మతములో యున్న సాత్త్వికులకు ఏమాత్రము నచ్చడము లేదు. అయినా వారిని మతము అనునది నోరు విప్పకుండా చేసినది. మౌనముగా చూస్తూ ఉండవలసి వచ్చినది.

ప్రతి మనిషి పుట్టుకతోనే ఒక మతములో యున్నాడు. ఆ మతము హిందూమతము కావచ్చు, క్రైస్థవమతము కావచ్చు, ఇస్లామ్ మతము కావచ్చు. పుట్టినప్పుడు అందరము మనుషులమే. కొంత బుద్ధి వచ్చు వరకు అందరము కలిసిమెలిసి తిరుగుచూ ఏ భేదము లేకుండా ఉన్న మనుషులు, కొంత బుద్ధి పెరిగి యుక్తవయస్సు వచ్చేటప్పటికి మనిషికి పుట్టుకలోనే అంటుకొని యున్న మతము మనిషిలో పొడచూపను మొదలు పెట్టును. అప్పుడే వారు పుట్టిన కుటుంబమును బట్టి నేను హిందువును, నేను క్రైస్థవున్ని, నేను ముస్లీమ్‌నను భావము మనిషిలో వచ్చును. అప్పటినుండి నా దేవుడు, నా మతము, నా మతమువేరు అను భావము మొదలగును. ఇట్లు పుట్టిన ప్రతి మనిషి ఏదో ఒక మతములో చిక్కుకొంటున్నాడు. చివరకు మతము వలన దేవున్ని తెలియలేదుగానీ, ఇతర మత ద్వేషము పెంచుకొని విధ్వంసక చర్యలకు పాల్పడడము జరుగు చున్నది.

నేను ఒక హిందూ కుటుంబమున పుట్టాను. దానివలన నేను చెప్పకనే, నాకు తెలియకనే నేను హిందువు అయిపోయాను. యుక్తవయస్సు రాగానే మత సంబంధమైన భావములు మనిషికి తప్పక వస్తాయి. ఒకవేళ వానికి రాకపోయినా మత సంబంధముగా కొన్ని సంస్థలు తయారయి ఉండి అవి మనిషిని మతములో ముంచి ఎత్తుతాయి. ఆ సంస్థలు మనిషిలో ఇతర మతముల ద్వేషమును పెంచుతాయి. చివరకు ప్రాణము పోయినా ఫరవాలేదు మతము కొరకు పోరాడాలి అని నూరిపోస్తాయి. ఇటువంటివి అన్ని మతములలో ఉన్నాయి. ప్రస్తుతము నేను హిందువునయిన దానివలన హిందువులలో మత రక్షణ సంఘములు కొన్ని ఏర్పడి ముస్లీమ్‌లకు వారి సంస్థలు ఉగ్రవాదాన్ని నూరిపోసినట్లు, హిందువులలో కూడా మత రక్షణ

పేరుతో  ఇతర మతస్థులను బోధించకుండా, మతవ్యాప్తి చేయకుండా అడ్డుకోవాలని బోధించుచున్నవి.  చివరకు ఏమాత్రము దైవజ్ఞానము తెలియని హిందూసంఘముల వారు  ఇతర మతములేవో తమ మతము ఏదో గుర్తు పట్టని గ్రుడ్డివారై  హిందువులు హిందువుల మీద దాడి చేసిన సంఘటనలు చాలా కలవు.

నాకు తెలియకుండానే నా ప్రమేయము లేకుండానే, నా ఇష్టా యిష్టముల మీద ఆధారము లేకుండా నేను హిందువుగా పిలువబడు చున్నాను.  నీవు అడకత్తెరలో ఇరుక్కున్నట్లే  నేను ఇరుక్కోకుండా బయటికి వచ్చి అన్ని మతములు నావేయని అంటున్నాను.  మూడు మతముల భావములను వదలి  మూడు మత గ్రంథములలోని జ్ఞానము తెలియండియని చెప్పుచున్నాను.  ప్రతి మనిషి **భగవద్గీత, బైబిలు, ఖురాన్** మూడు గ్రంథములను సమానముగా గౌరవించుచూ  ప్రతి ఇంటిలోనూ మూడు దైవగ్రంథములను ఉంచుకొని మీరు చదివి, మీ పిల్లలను కూడా చదివించండని చెప్పుచున్నాము.  మేమే స్వయముగా చాలామందికి మూడు గ్రంథములను సమకూర్చి ఇచ్చాము.  మేము చెప్పినట్లు చాలామంది మూడు గ్రంథములను చదివి నేడు ఎంతో జ్ఞానులుగా మారిపోయారు.

ఈ విధముగా అయితే మనమందరము మనుషులము, మన అందరి తండ్రి దేవుడు ఒక్కడేయని తెలియగలము.  అలా తెలియుట వలన మనుషుల మధ్య స్వమత, పరమత అను భేదములు పోయి మనుషులందరూ ఏక కుటుంబముగా మారిపోవుదురు.  అట్లు కాకుండా మా మత చట్టము ప్రకారము మేము నడుచుకొంటాము అని అంటే, ఇతరులు కూడా మాకు మతమున్నది, మాకు మత చట్టము కలదు, మేము కూడా మా మత చట్టము ప్రకారము నడుచుకొంటాము యని  అనగలరు.  మా

మతము ఇతర మతములకంటే గొప్పది అంటే, మిగతా మతముల వారు కూడా అదే మాట యనడమే కాక నిన్న మొన్న పుట్టిన మీ మతములకంటే అన్నిటికంటే ముందు పుట్టిన మా మతమే గొప్పయని హిందువులు అనుట జరుగుచున్నది. అట్లే మా అరబ్బీ భాష పవిత్రమైనదియని ముస్లీమ్‌లంటే మా సంస్కృత భాష ఇంకా గొప్పదని హిందువులు చెప్పుదురు. ఈ మాటలలో ఎక్కడగానీ దైవజ్ఞానము లేదు. దానివలన ఒకరి మతము మీద మరియొక మతము వారికి ద్వేష భాషము పెరిగిపోవును. కొంత కాలానికి అది తారాస్థాయికి చేరుకొని విధ్వంసాలకు దారితీయును. దీనికంతటికీ కారణము మతము అని బాగా కనిపించుచున్నది.

గడచిన అనాగరిక కాలములో అవగాహన లేని కాలములో మన పెద్దలు మొరటుగా బ్రతికియుండవచ్చును. ఆనాడు వారు నమ్మిన వాటినే ఆధారము చేసుకొని జీవించి యుండవచ్చును. అయితే నేడు ఎంతో నాగరికత పెరిగిన కాలమని అందరికీ తెలుసు. మనిషి ఆర్థికముగా, సామాజికముగా పూర్వముకంటే నేడు ఎంతో అభివృద్ధి చెందియున్నాడు. ప్రతి విషయమును సంపూర్ణముగా అర్థము చేసుకోగలుగుచున్నాడు. అయితే మత విషయము వచ్చునప్పటికి మనిషి పూర్తి మారిపోవుచున్నాడు. 'నా మతము నాది నీ మతము నీది'యని అంటున్నాడు. అన్ని మతముల ఉద్దేశ్యము, సారాంశము ఒక్కటేయని అర్థము చేసుకోలేకపోవుచున్నాడు. ఒక మతము మీద మరొక మతము ఆధిపత్యముగా ఉండవలెనని చూస్తున్నది. మా మతము ఇతర మతములకంటే పెద్దది అని చెప్పుకొనుటకు మతమును అభివృద్ధి చేయాలను చెడు ఆలోచన మనుషులలో చేరినది. ఆ ఆలోచన ప్రకారము స్వమత ప్రచారము, పరమత దూషణ మనిషి ప్రారంభించాడు. చేతనయినంత వరకు ఏదో ఒక ఆశచూపి నీ మతములో

లేనిది ఈ మతములో యున్నదని చెప్పి నమ్మించి మతములను మార్చుచున్నారు. అటువంటప్పుడు మా మతము క్షీణించి పోవుచున్నదని హిందువులు, ఇతర మతములను మార్చి తమ మతములో చేర్చుకోవాలని క్రైస్థవులు, ముస్లీమ్‌లు ఒకరిమీద మరొకరు పోటీగా పని చేయుచున్నారు. ఈ విధానములోనే మతముల మధ్య ఘర్షణలు ఏర్పడుచున్నవి. అటువంటి ఘర్షణలే నేడు ప్రపంచ వ్యాప్తముగా యున్నవి. చివరికి మానవ జాతి వినాశనము తప్ప ఏమీ లేదు కదా! నేడు మేథావులుగాయున్న వారు సహితము మతవ్యాప్తి కొరకే పని చేయుచున్నారు. ఎవరు ఆలోచించినా ఇది మంచిది కాదు.

**35) ప్రశ్న :- ఇంతవరకు కొన్ని ప్రశ్నలను అందించాను. వాటికి మీరు తగిన విధముగా జవాబిచ్చారు. ఇంతవరకు ప్రశ్నలను అడిగిన వ్యక్తి పుట్టుకతో ముస్లీమ్ కాకపోయినా ముస్లీమ్ కుటుంబములో పుట్టిన వారికంటే ఎక్కువ ఇస్లామ్‌ను గురించి మాట్లాడినట్లు కనిపించుచున్నది. పుట్టుకతో ముస్లీమ్‌లు కూడా ఇస్లామ్‌ను అంతగా ప్రేమించియుండరేమో అనిపిస్తా వుంది. హిందూ మతమునుండి పోయి ముస్లీమ్‌గా తయారయి ఇస్లామ్ తరపున అంతలోతుగా మాట్లాడుచున్నాడు కదా! అటువంటి వారికి దేవుడు తొందరగా మోక్షమును కల్పిస్తాడా, అనగా పరలోక రాజ్యములో చేర్చుకుంటాడా? అతనిని నీవు ఎందుకు హిందూమతము వదలి ఇస్లామ్‌లో చేరావు? అని అడిగితే ఆయన ఇలా సమాధానము చెప్పాడు. "నేను ఇస్లామ్ స్వీకరించడానికి హిందూమతములోని లోపాలు కాదు. దేవున్ని విశ్వసిస్తూ, ఆయన పంపిన ప్రవక్తలు అందరినీ విశ్వసిస్తూ, చివరి దైవప్రవక్తగా ముహమ్మద్‌ని విశ్వసించి అనుసరించుచున్నాను" అని అంటున్నాడు. ఇలా మతములు మారు వారందరూ ఏదో ఒకటి చెప్పుచున్నారు. వారు చెప్పునది హేతుబద్దమైన జవాబేనా?**

**జవాబు :-** అతను అరబ్బీ భాషను గురించి బహిర్పరచిన ప్రేమను చూచి ఇతను అరబ్బీ దేశ ముస్లీమ్ అని అనుకున్నాను. అతను హిందువులలో అదియూ ఈ ప్రాంతములో జన్మించిన వాడయి ఉంటాడనుకుంటాను. అటువంటప్పుడు అతనికి హిందూమతమును వదలి పోవడానికి, దేశ భాషలలో గొప్పదయిన తెలుగు భాషను కాదని ఇతర దేశ భాషను గొప్పగా చెప్పటానికి, అతను చెప్పు కారణాలు ఏవయినా ఉండవచ్చును. కొందరు పెద్దలు ఒక సామెత చెప్పుచుందురు. "రంకు నేర్చినమ్మ బొంకు నేర్చదా?" అని అట్లే ఎవరు ఏ పనిని చేసినా దానిని సమర్థించుకొనుటకు తగిన దారులు ముందే వెతుక్కొనియుందురు. అటువంటి వారిని ఏ ప్రశ్న అడిగినా దానికి ఏదో ఒక జవాబు చెప్పుచుందురు. అలా చెప్పవలెనని ముందే తయారయి ఉందురు. అతను చెప్పిన దానినిబట్టి అతనిని ప్రశ్నించకుండా మనము చర్చించుకొంటే పదిమందికి ఉపయోగపడు జ్ఞానము తెలియును. అందువలన ఇక్కడ కొంత చర్చ మనలో మనము జరుపుకొందాము. సృష్ట్యాదిలోనే దేవుడు జ్ఞానమును చెప్పాడు. కొందరు దేవుని జ్ఞానము నిన్న మొన్న పుట్టింది అని అనుకోవడము, నిన్న పుట్టిన జ్ఞానమును నేను అనుసరిస్తున్నాను అనడములో అర్థము లేదు. జ్ఞానము నిన్ననో మొన్ననో పుట్టలేదు. నీవు పుట్టకనే జ్ఞానము ముందే పుట్టినది. నీకు నిన్న మొన్న జ్ఞానము వచ్చినదంటేనో, లేక నిన్న మొన్న జ్ఞానము అర్థమయినదంటేనో, అదే జ్ఞానమే కదా! మొదటినుండి భూమిమీద ఉండేదని, మొదట నచ్చనిది తర్వాత ఎలా నచ్చినదని ప్రశ్న రాగలదు. దానికి వారివద్ద జవాబు ఉండదు ఏదో ఒకటి చెప్పినా అది సరియైన జవాబుగా ఉండదు.

**36) ప్రశ్న :- నమాజ్ (ప్రార్థన) సంబంధించినంత వరకు విశ్వాసముతో కూడిన శారీరక భాషయని చెప్పవచ్చును. నమాజ్ ఆచరించే కొద్దీ మిగతా విషయముల అర్థము కూడా తెలుస్తుంది. మానవాళి అంతా ఒక్కటే,**

**అందరూ సమానమని తెలియజేయడమే "ఇస్లామ్" లక్ష్యము. ప్రతి విషయములో సర్వమానవాళికి కామన్‌గా కనిపించే ఆచరణ, అలవాట్లు, క్రమశిక్షణ, బోధన చాలా విషయములు ముడిపడి ఉన్నాయి. ముసల్మాన్ ఒక్కడే ప్రపంచ పౌరునిగా కనపడతాడు. అందరి అర్చన ఒకేలాగ ఉంటున్నది. 1) కలిమ కామన్ 2) అజా కామన్ 3) నమాజ్ కామన్ 4) రోజా కామన్ 5) సలామ్ కామన్ 6) దస్తార్ కామన్ 7) నేమ్స్ కామన్ 8) డ్రస్‌కోడ్ కామన్ 9) ఈద్ కామన్ ఇలా చెప్పుకుంటూ పోతే చాలా ఉన్నాయి. హదీస్, ఖురాన్ ప్రపంచ భాషలలో అనువదింపబడినవి. మనకు కావలసిన భాషలో చదువుకోవచ్చు. తప్పులు ఉంటే అల్లా నన్ను క్షమించాలి. (ప్రపంచ శారీరక భాష శాస్త్రజ్ఞుల పరిశోధన తెలుసుకొంటే బాగుంటుంది.) ఈ విధముగా మరొక వ్యక్తి అంటున్నాడు. దీనికి మీ స్పందన ఏమిటి?**

**జవాబు :-** వారు మాట్లాడే ప్రతి మాటకు నా జవాబు వ్యతిరేఖముగా కనిపిస్తూ యుంటుంది. అట్లని వ్యతిరేఖముగా చెప్పడమే నా పనియని మీరు అనుకోవద్దండి. బ్రహ్మవిద్యా శాస్త్రమునకు వ్యతిరేఖముగా యున్న దానిని తప్పక చెప్పవలసియుండును. మనిషి 'తన ఇష్టమొచ్చిన దానిని దేవుడు' అనుకున్నంత మాత్రమున అది దేవుడు కాదు. ఆ విషయమును ఇతరులు చెప్పినా "వారు అసూయతో చెప్పుచున్నారు. మా మాటే సత్యము" అనువారు కూడా యుండవచ్చును. అందువలన జ్ఞానమార్గములో ఏ విషయమునయినా తేల్చి చెప్పుటకు దేవుడు ఒక శాస్త్రమును ఇచ్చాడు. దానినే బ్రహ్మవిద్యా శాస్త్రము అని అంటున్నాము. అది ఆధ్యాత్మిక విషయములన్నిటినీ తేల్చి చెప్పు **గీటురాయి**గా యున్నది. శాస్త్రములు మొత్తము ఆరు కాగా, అందులో ఐదు ప్రపంచ సంబంధమైనవికాగా ఒకటి మాత్రము దేవుని విషయములకు సంబంధించినది. దానిని పెద్ద విద్యా

శాస్త్రము అని కూడా అంటారు. బ్రహ్మ అనగా పెద్దయని అర్థము. అన్నిటిలో పెద్ద దేవుడే అయిన దానివలన దానిని దేవుని విద్యా శాస్త్రమని కూడా చెప్పుచుందురు. దేవుని జ్ఞానమును ప్రతి మనిషి నేర్వవలసినదిగా యుండుట వలన దానిని 'విద్య' అని అంటున్నాము. దేవుని విద్యను తేల్చి చెప్పునది బ్రహ్మవిద్యా శాస్త్రము.

బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము పైన చెప్పిన సమాచారములో ముస్లీమ్ మాత్రమే ప్రపంచ పౌరునిగా యున్నాడు. ముస్లీమ్ ధరించే దుస్తులలోగానీ, మాట్లాడే భాషలోగానీ, చేసే ఆచరణలోగానీ అన్నిటియందు ముస్లీమ్‌లందరూ సమానముగా ఉండుట వలన, మిగతా ఎవరూ అలా లేకపోవడము వలన, ముస్లీమ్‌లు ఎక్కువ, మిగతా వారు తక్కువ అని చెప్పుటకు వీలులేదు. ఇవన్నియూ పైకి కనిపించు విధానములే అయినందున అవన్నియూ దేవునికి సంబంధించినవని చెప్పలేము. అవన్నియు క్రమశిక్షణకు గుర్తులుగా కనిపించుచున్నవి. దైవికజ్ఞానము అంతయూ శరీరము లోపలికి సంబంధించినదని చెప్పవచ్చును. బయట కనిపించునది ఆధ్యాత్మికమునకు సంబంధముండదు. ముస్లీమ్‌లందరూ ఒకే డ్రస్ ధరించిన మిగతా ఆచరణలలో అన్నీ ఒకే విధముగా యున్నా అవన్నియూ దైవికమునకు సంబంధించినవని అనిపించుకోవు. అవన్నియూ ప్రపంచ క్రమశిక్షణకు సంబంధించినవని చెప్పవచ్చును. ఒకే డ్రస్ కల్గియున్న పిల్లలను స్కూలు పిల్లలని చెప్పవచ్చును. అట్లే ఒకే డ్రస్ కల్గి, ఒకే నడక నడచు వారిని మిలిటరీ సైనికులని చెప్పవచ్చును. అంతేగానీ వారిని జ్ఞానులని, దైవజ్ఞానముతో సంబంధమున్న వారని చెప్పలేము కదా! దైవజ్ఞానమునకు బయటి క్రమశిక్షణకు సంబంధము లేదు. అలా అందరూ ఒకే ఆచరణ కల్గియుండడము మానవులందరూ సమానమని చెప్పు గుర్తు కూడా కాదు. బయటి విషయములతో దైవజ్ఞానమును పోల్చలేము.

దైవగ్రంథములలో దేవుడు మనుషులకందరికీ సమానుడని చెప్పి యున్నారు. దేవుడు చెప్పిన జ్ఞానమును తెలియగల్గితే మనుషులందరూ ఎట్లు సమానముగా యున్నారో తెలియగలదు. దేవుని జ్ఞానము ద్వారా ప్రతి మనిషి శరీరములో ఉన్న విధానము అంతయూ సమానముగా యున్నదని తెలియగలదు. జ్ఞానరీత్యా అందరూ సమానమేయని తెలియ వలెనుగానీ, బయట డ్రస్‌కోడ్‌ను బట్టిగానీ, తిండినిబట్టిగానీ, మాటలను బట్టిగానీ అందరూ ఒకటను భావము రాదు. శరీర అంతర్ముఖ జ్ఞానము తెలియకనే నేడు ఎక్కడ చూచినా మనుషుల మధ్య కలహాలు చెలరేగుచున్నవి. ఎక్కడ చూచినా నీవు వేరు, నేను వేరు అను భావముతోయున్నారు. మొదటికి దైవజ్ఞానము లేని దానివలన అన్ని అనర్థములు ఏర్పడుచున్నవి. పై ప్రశ్నలో ముస్లీమ్ ఒక్కడే ప్రపంచ పౌరుడుగా యున్నాడు అని అనుట వలన మిగతా మతములను కించపరచి మాట్లాడినట్లగుచున్నది. అలా అనుట వలన మిగతా మతస్థులు కూడా అదేమాట మాట్లాడే అవకాశమున్నది. ఇట్లు ఒకచోట చిన్న సమస్య మొదలై అది చివరికి యుద్ధము వరకు పోవుచున్నది. అందువలన మానవులందరూ ఒక్కటేయని తెలియుటకు దేవుడు దైవగ్రంథములలో చెప్పిన జ్ఞానమును తెలియవలెను. ఏ మతము వారు మాది అనుకొను వారి మత గ్రంథమును చదివి, తర్వాత ఇతర మత గ్రంథములను చదువుట వలన మనుషుల మధ్య సామరస్యము ఏర్పడును. అట్లుకాకున్న అందరూ ఒక్కటేయని పైకి చెప్పుచున్నా లోపల మేము వేరు అను భేద భావమేయుండును. అంతర్ముఖ జ్ఞానము తెలియనంతవరకు మనిషిలోపల యున్న ఆ భేద భావము పోదు. అందువలన **అన్నిటికీ జ్ఞానమే పరిష్కారము.** అందరూ సమానముగా ఉండుటకు, ఎటువంటి అసూయ ద్వేషములు లేకుండా మనుషుల మధ్య ప్రేమాభిమానములు కలుగుటకు తప్పనిసరిగా జ్ఞానము అవసరము. జ్ఞానము లేనిది

ఐకమత్యము, సమానత్వము సాధ్యము కాదు. పైన ఆచరణ, ఆరాధన వలన మనుషులలో క్రమశిక్షణ వచ్చునేమోగానీ 'అందరము సమానము' అను భావము రాదు. అందువలన అందరికీ అంతరంగమున గల జ్ఞానమే అవసరము.

ఇస్లామ్‌ను బోధించినది అంతిమ దైవగ్రంథము ఖురాన్. ఖురాన్ గ్రంథము ముందు వచ్చిన గ్రంథములను సమర్థిస్తున్నది. ముందు వచ్చిన గ్రంథములలోని జ్ఞానము గొప్పదని చెప్పుచున్నది. ముందు వచ్చిన గ్రంథములలో **జ్ఞానజ్యోతి** ఉందని, **మార్గదర్శకము** ఉందని సూరా ఐదులో ఆయత్ 44, 46, 48లో చెప్పియున్న మాటలు అతనికి కనిపించలేదా? హిందూమతములో పుట్టిన అతనికి భగవద్గీతలో జ్ఞానజ్యోతి, మార్గదర్శకము కనిపించలేదా? మొదటి గ్రంథము, రెండవ గ్రంథములో కనిపించనప్పుడు మూడవ గ్రంథములో ఎలా కనిపించినది? **(62-5) లో తౌరాతు గ్రంథమును అనుసరించనివాడు ఎన్ని గ్రంథములను అనుసరించినా గ్రంథములను మోయు గాడిదతో సమానమని ఉపమానము కూడా చెప్పియున్నారు కదా! (5-68) లో తౌరాతు (భగవద్గీత), ఇంజీలు (బైబిలు), ఖురాన్‌లను మీ జీవితాలలో నెలకొల్పు వరకు మీరు ఏ ధర్మము పైనా లేనట్లేయని** చెప్పినప్పుడు ఒక్క గ్రంథమును, ఒక్క మతమును గురించి చెప్పడము దేవుని లెక్కలో తప్పుకాదా?

భగవద్గీతను కృష్ణుడు చెప్పగా అర్జునుడు విన్నాడు. అర్జునుడు విన్నది వ్యాసునికి చెప్పగా వ్యాసుని చేత గ్రంథము తయారయినది. అట్లే ఖురాన్‌ను జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్త గారికి చెప్పాడు. ముహమ్మద్ ప్రవక్త మిగతా ప్రజలకు చెప్పగా, మిగతా ప్రజలు ఖురాన్‌ను వ్రాశారు. ఇక్కడ బాగా గమనిస్తే చెప్పిన వాడు ఒకడు, విన్నవాడు ఒకడు. వ్రాసిన

వారు మరొకరు. భగవద్గీత విషయములో గానీ, ఖురాన్ విషయములోగానీ అలాగే జరిగినది.

| గ్రంథము | చెప్పినవారు | విన్నవారు | వ్రాసిన వారు | కాలము |
|---|---|---|---|---|
| భగవద్గీత | శ్రీకృష్ణుడు | అర్జునుడు | వ్యాసుడు | ద్వాపరయుగములో |
| ఖురాన్ | జిబ్రయేల్ | ముహమ్మద్ ప్రవక్త | ప్రజలు | కలియుగములో |

రెండు గ్రంథములు ఒకే విధముగా జరిగినప్పుడు భగవద్గీతను చెప్పినది కృష్ణుడుకాగా, అర్జునుడు వార్తను చేర్చినవాడు కాగా, ఆ వార్తను వ్రాసినవాడు వ్యాసుడు అయినాడు. అలాగే ఖురాన్ విషయములో ఖురాన్ జ్ఞానమును చెప్పినవాడు జిబ్రయేల్‌కాగా చెప్పిన జ్ఞానమును వార్తవలె తీసుకపోయి ప్రజలకు ఇచ్చినవారు ముహమ్మద్‌కాగా, వార్తగా వచ్చిన ఖురాన్ జ్ఞానమును గ్రంథముగా వ్రాసినవారు వినిన ప్రజలే. నేడు హిందువుల దృష్ఠిలో భగవద్గీతను చెప్పిన కృష్ణుడు జ్ఞానిగా గుర్తింపబడినప్పుడు, ముస్లీమ్‌లకు ఖురాన్ జ్ఞానము చెప్పిన జిబ్రయేల్ ఎందుకు జ్ఞానిగా గుర్తింపబడలేదు? తెలివిగల కొందరి దృష్ఠిలో అయినా జిబ్రయేల్ ఎందుకు జ్ఞానిగా గుర్తుకు రాలేదు? జ్ఞానము గల హిందువులు కొందరు కృష్ణున్ని జ్ఞానిగా గుర్తించి, పరమాత్మను దేవునిగా ఆరాధించుచున్నారు. ముస్లీమ్‌ల లోనికి వచ్చి చూస్తే పరమాత్మ (అల్లాహ్) అయిన వానిని దేవునిగా ఆరాధించుచూ అన్యదేవతారాధన చేయడము లేదు. అది సరైన పద్ధతే. అయితే జిబ్రయేల్‌ను ఏమాత్రము జ్ఞానిగా గుర్తించలేదు. ఇక్కడ జిబ్రయేల్‌కు ఎందుకు ముస్లీమ్‌లలో గుర్తింపు లేదు? అను ప్రశ్నకు జవాబు లేదు. నిజాయితీగా మాట్లాడితే అన్నము పెట్టిన వానిని మరచిపోకూడదు. ఎందుకనగా! అతను మనిషికున్న ఆకలి తీర్చాడు. అలాగే జ్ఞానము ఇచ్చిన వానిని మరువకూడదు. ఎందుకనగా! అతను మన జీవితానికి అవసరమైన

జ్ఞానమును ఇచ్చాడు. అట్లుకాక అన్నము పెట్టిన వానిని మరచిపోయి ఆకు ఇచ్చిన వానిని జ్ఞాపకము పెట్టుకొంటే అది మంచిది కాదు అని ఎవరయినా చెప్పగలరు. అదే విధముగా మృతుడుగా యున్న మనిషికి జీవము గల జ్ఞానము నిచ్చిన జిబ్రయేల్‌ను మరచిపోవడము మంచిది కాదని చెప్పవచ్చును. ఎవరయినా అలా చేసినా అది తప్పని చెప్పకపోవడము మరీ తప్పు. అయితే నేడు స్వార్థపూరిత మనుషులు తప్పు ఒప్పులను చూడకుండా అందరూ ఏది మాట్లాడితే అదే మాట్లాడుచున్నారు. ఇంతవరకు నీవు ప్రశ్నలుగా అడిగిన వ్యక్తి మూలాలను చూచినప్పుడే అతను ఎంత గొప్ప జ్ఞానము కలవాడో అర్థమయినది. ఆయన మత మార్పులో వ్రాసిన విధానమును చూచినప్పుడే అర్థమయినది. ఆయన దేవుడు పంపిన ప్రవక్తలను విశ్వసిస్తూ చివరి ప్రవక్తను విశ్వసిస్తున్నాను అన్నాడు. ప్రవక్తల కంటే గొప్పవాడు ప్రవక్తలకు జ్ఞానమునిచ్చిన అల్లాహ్‌ను అతను మరచిపోయాడు. అల్లాహ్‌ను గురించి ఒక్కమాట కూడా చెప్పక ప్రవక్తలను గురించి చెప్పుట వలన, భగవద్గీత విషయములో కృష్ణున్ని వదలి అర్జునున్ని పట్టుకున్నట్లు కనిపిస్తున్నది. జరిగిపోయిన దానిని గురించి అనుకోవడము కంటే జరుగవలసిన దానిని గురించి చెప్పుకోవడము మంచిది. ఇప్పటికయినా మధ్యవర్తులైన వారిని వదలి నేరుగా అల్లాహ్‌ను ఆశ్రయించ మని నా తరపున తెలుపుచూ ఇంతటితో ముగించుచున్నాను.

# సమాప్తము

**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే**
**ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**

**అసత్యమును వేయిమంది చెప్పినా, అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా, అది అసత్యము కాదు.**

# భావము-భాష

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు

